84-85

# శ్రీ రక్తాక్షినామసంవత్సర
# సిద్ధాన్త
# పంచాఙ్గ పీఠికా


పంచాగకర్తలు:

దైవజ్ఞశేఖర

శ్రీ తంగిరాల చిన హనుమత్సిద్ధాంతిగారు

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి.

(పూర్ణ జ్యోతిషాలయం)

రేలంగి — తణుకు తాలూకా,

పశ్చిమ గోదావరి జిల్లా (ఆంధ్ర.)

ఓమ్

# శ్రీ పద్మావతీదేవి



ఓమ్॥ ఈశానాం జగతోఽస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్స్థలనిత్యవాసరసికాం తత్ క్షాంతిసంవర్ధినీమ్ ।
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

ఓమ్

శ్రీరస్తు

శ్రీలక్ష్మీవేంకటేశః ప్రసన్నో భవతు

శ్రీ శ్రీనివాసాయ పరస్మై బ్రహ్మణే నమః

# * పీఠికారంభః *

ఓమ్॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ । ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే ॥
యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్ । విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥
శ్రీమాన్ శ్రీశేషపృథ్వీధరశిఖరపరిస్పందిపాదారవింద-
ద్వంద్వో మందీకృతేందుద్యుతిరుచిరుచిరస్వాన్తనస్సంతనోతు ।
లక్ష్మీం లక్ష్మీవియోగాసహనిజహృదయః కోఽపి కారుణ్యపూర్ణో
దేవాధీశః ప్రఫుల్లాంబుజదళనయనస్సర్వదా సర్వదో నః ॥
కందర్పకోటి సదృశం కమనీయవేషం ముక్తావళీలలితకంఠముదారహారమ్ ।
పీతాంబరద్యుతి విరాజిత దివ్యదేహం శ్రీవేంకటేశ వపురాత్మని సన్నిధత్తామ్ ॥
మానాతీత ప్రథిత విభవాం మంగళం మంగళానాం
వక్షఃపీఠీం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యా ।
ప్రత్యక్షానుశ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయో మూర్తిం శ్రియమశరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే ॥
శ్రీవిష్ణుచిత్తకులనందనకల్పవల్లీం శ్రీరంగరాజహరిచందనయోగదృశ్యామ్ ।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం గోదామనన్యశరణశ్శరణం ప్రపద్యే ॥
విశదోర్ధ్వపుండ్రవిలసన్ముఖాంబుజం లలితోపవీతకలితోరువక్షసమ్ ।
కరపద్మవజ్రకలితత్రిదండకం కలయే యతీంద్రమహనీయవిగ్రహమ్ ॥
ఆరోగ్యం పద్మబంధుర్వితరతు సతతం సంపదం శీతరోచిః
భూలాభం భూమిపుత్రస్సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః ।
సౌభాగ్యం దేవమంత్రీ వితరతు సతతం భార్గవశ్శౌర్యమార్కిః
ధైర్యం రాహుశ్చకీర్తిం సకలశుభయుతాం కేతురిష్టార్థసిద్ధిమ్ ॥
అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నానమాచరన్ । వస్త్రైరాభరణైర్దేహమలంకృత్య తతశ్శుచిః ॥
శ్రీవేంకటాచలాధీశం శ్రీనిధిం కరుణానిధిమ్ । నమస్కృత్య హృషీకేశం యతిరాజం చ నిత్యశః ॥
సంవత్సరఫలం సమ్యగ్యశ్శృణోత్యేకమానసః । దద్యుర్మనోరథం సర్వం దేవతాః ఫలముత్తమమ్ ॥
జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రమాణత్వేన నిశ్చితమ్ । చంద్రార్కౌ తత్ర సాక్షిత్వం భజేతే విశ్చలంయతః॥
యథా శిఖామయూరాణాంనాగానాంమణయోయథా।తథా వేదాంగశాస్త్రాణాం జ్యౌతిషం మూర్ధ్నిసంస్థితమ్
శ్రీవత్స జన్మాఽఖిల సౌరతంత్ర సిద్ధాంత విజ్ఞానమతిర్హ్యనూమాన్ ।
శ్రీ తంగిరాలాన్వయజోఽహమార్యాః శ్రీ శేషశైలేశ కృపావిశేషః ॥
సోఽహం యథామతి మతాని విమృశ్య విద్వదాచారరీతిమవిలంఘ్య గురూపదేశమ్ ।
శ్రీ వేంకటేశకృపయా వితనోమి సాంగం పంచాంగమత్ర విబుధాస్సదయా భవంతు ॥

## గురువందనమ్

దైవజ్ఞప్రథమస్య పూర్ణ యశసశ్శ్రీబాలపూర్ణస్య యః
పుత్రశ్శ్రీపిడపర్తి వంశజని సుబ్రహ్మణ్యశాస్త్రీ కృతీ ।
సూర్యార్యాదిపురాతనాద్యతనసిద్ధాంతేషు గోలాదివి-
త్త్రిస్కంధాంబుధిపారగో మమ గురుః వందే సదా శ్రేయసే ॥

## దైవజ్ఞప్రశంసా, దైవజ్ఞనివాసః

శ్రీ వేంకటేశానృసింహహాటకేశాదిదేవైరభిరక్షమాణమ్ ।
గోదావరీ పశ్చిమయోజనాంతర శ్రీగోస్తనీతీరవిరాజమానమ్ ॥

శ్రీ వేదవేదాంగవిదుత్తమైర్బుధైః జ్యోతిర్విదగ్రేసర పండితైశ్చ ।
ఆఢ్యైశ్వర్యవదాన్యైరభిభూషితం చ చకాస్తి రేలంగిపురం సురమ్యమ్ ॥

యద్వంశే బహవశ్శ్రుతిస్మృతివిదో సజ్జ్యోతిషే పండితాః
శ్రీవత్సాభిధగోత్రజాస్తదనుమత్పైతామహోఽత్యంతధీః ।
శ్రీమత్పండితసార్వభౌమహనుమాన్వేదార్థవిత్సాత్త్విక-
స్తత్తత్కర్మసుకాలనిర్ణయకృతే పంచాంగకర్తా పురా ॥

తస్యాత్మజో వేంకటకృష్ణసోమయాజీమసిద్ధాంతవిదగ్రగణ్యః ।
శ్రీరామభక్తః ప్రతివత్సరం సత్పంచాంగమత్యంతముదాఽకరోచ్చ ॥

జ్యాయాన్ వేంకటహనుమాన్ ద్వితీయకస్తు పూర్ణదైవజ్ఞః ।
తార్తీయోఽహం హనుమాన్ వేంకటకృష్ణాఖ్యదైవవిత్పుత్రాః ॥

ఆమార్యం చ్యవనోఙ్గిరోఽత్రిముఖరానభ్యర్చమాన్యా-
న్మునీనాచార్యానపరాన్మయా హనుమతా శ్రీతాతపాదం గురుమ్ ।
పంచాంగం విరచయ్య వేంకటవిభోః పాదాబ్జయోరర్పితం
సశ్రేయాంసి దయామయః కలయతాం శ్రీ వేంకటేశః ప్రభుః ॥

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి.

# శ్రీ తిరుపతి (వేంకటాద్రి) నగర్యాః

విషువచ్ఛాయాంగుళాని 2_55. అక్షాంశాః + 13_44

భూమధ్యాత్ దేశాంతరకాలః ఘ॥ ÷ 0_29 గం + 0_12
అయనాంశాః భా 23°_33′_57″

## స్ఫుటలగ్న ప్రమాణ పుష్కరకాలాః

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మేషస్య | 4_28 | = | 3_ 8 | తులాయాః | 5_18 | = | 4_14 |
| వృషభస్య | 5_ 4 | = | 2_22 | వృశ్చికస్య | 5_31 | = | 1_17 |
| మిథునస్య | 5_30 | = | 4_24 | ధనుషః | 5_19 | = | 3_43 |
| కర్కాటకస్య | 5_26 | = | 1_16 | మకరస్య | 4_44 | = | 2_13 |
| సింహస్య | 5_10 | = | 3_38 | కుంభస్య | 4_14 | = | 3_23 |
| కన్యాయాః | 5_ 6 | = | 2_23 | మీనస్య | 4_ 8 | = | 0_58 |

ఈ లగ్న ప్రమాణములు ఈ కాలమునకు తిరుపతికి చేయబడినవి. ఇవియే స్ఫుటలగ్న ప్రమాణములుగ గ్రహించవలెను. తిరుపతి ప్రాంతములలోని అలవాటులో ఉన్న లగ్న ప్రమాణములు. ప్రాచీన కాలములో సాధింపబడినందున పరిగ్రాహ్యములు గావు.

## తిరుపతినుండి రాజమండ్రికి దేశాంతరకాలము

| సాయన మాసము → | మేష | వృషభ | మిథున | కర్కాటక | సింహం | కన్య |
|---|---|---|---|---|---|---|
| | +౩౨ | +౩౯ | +౪౫ | +౪౮ | +౪౫ | +౬౯ |
| | తులా | వృశ్చిక | ధనుః | మకర | కుంభ | మీన |
| | +౩౨ | +౨౪ | +౧౯ | +౧౬ | +౧౯ | +౨౪ |

పై సంస్కార విఘడియలను తిథ్యాదికమునందు మేషాది సాయన మాసారంభదినమున సంస్కరింపగా రాజమండ్రికి సూర్యోదయాది కాలమగును. మాసాదినుండి తిరిగి మాసాంతము వరకు అనుపాతముచే మధ్యదినములందు సంస్కరింపవలెను.

# తిరుపతి (వేంకటాద్రి) ప్రాంతమందు సూర్యోదయాస్తమయకాలములు

| 1984 సం॥ | తేది | సూ. ఉ. | | సూ. అ. | |
|---|---|---|---|---|---|
| | | గం. | ని. | గం. | ని. |
| ఏప్రిల్ | 2 | 6 | 11 | 6 | 21 |
| | 7 | 6 | 7 | 6 | 21 |
| | 12 | 6 | 5 | 6 | 22 |
| | 17 | 6 | 2 | 6 | 22 |
| | 22 | 5 | 59 | 6 | 23 |
| | 27 | 5 | 56 | 6 | 24 |
| మే | 2 | 5 | 54 | 6 | 25 |
| | 7 | 5 | 52 | 6 | 26 |
| | 12 | 5 | 50 | 6 | 27 |
| | 17 | 5 | 49 | 6 | 28 |
| | 22 | 5 | 48 | 6 | 30 |
| | 27 | 5 | 49 | 6 | 32 |
| జూన్ | 1 | 5 | 48 | 6 | 33 |
| | 6 | 5 | 48 | 6 | 34 |
| | 11 | 5 | 48 | 6 | 36 |
| | 16 | 5 | 49 | 6 | 37 |
| | 21 | 5 | 50 | 6 | 38 |
| | 26 | 5 | 51 | 6 | 39 |
| జూలై | 1 | 5 | 53 | 6 | 40 |
| | 6 | 5 | 55 | 6 | 40 |
| | 11 | 5 | 56 | 6 | 40 |
| | 16 | 5 | 56 | 6 | 40 |
| | 21 | 5 | 58 | 6 | 40 |
| | 26 | 5 | 59 | 6 | 39 |
| | 31 | 6 | 0 | 6 | 38 |
| ఆగస్టు | 5 | 6 | 1 | 6 | 35 |
| | 10 | 6 | 2 | 6 | 33 |
| | 15 | 6 | 3 | 6 | 31 |
| | 20 | 6 | 4 | 6 | 28 |
| | 25 | 6 | 4 | 6 | 26 |
| | 30 | 6 | 5 | 6 | 22 |
| సెప్టెంబరు | 4 | 6 | 5 | 6 | 19 |
| | 9 | 6 | 6 | 6 | 16 |
| | 14 | 6 | 5 | 6 | 12 |
| | 19 | 6 | 6 | 6 | 9 |
| | 24 | 6 | 6 | 6 | 5 |
| | 29 | 6 | 6 | 6 | 2 |
| అక్టోబరు | 4 | 6 | 6 | 5 | 58 |
| | 9 | 6 | 6 | 5 | 54 |

| 1984 – 85 సం॥ | తేది | సూ. ఉ. | | సూ. అ. | |
|---|---|---|---|---|---|
| | | గం. | ని. | గం. | ని. |
| అక్టోబరు | 14 | 6 | 7 | 5 | 51 |
| | 19 | 6 | 8 | 5 | 48 |
| | 24 | 6 | 8 | 5 | 46 |
| | 29 | 6 | 10 | 5 | 44 |
| నవంబరు | 3 | 6 | 11 | 5 | 42 |
| | 8 | 6 | 14 | 5 | 40 |
| | 13 | 6 | 16 | 5 | 39 |
| | 18 | 6 | 18 | 5 | 38 |
| | 23 | 6 | 20 | 5 | 38 |
| | 25 | 6 | 21 | 5 | 38 |
| | 30 | 6 | 24 | 5 | 39 |
| డిశంబరు | 5 | 6 | 26 | 5 | 40 |
| | 10 | 6 | 29 | 5 | 42 |
| | 15 | 6 | 34 | 5 | 44 |
| | 20 | 6 | 34 | 5 | 46 |
| | 25 | 6 | 37 | 5 | 49 |
| | 30 | 6 | 40 | 5 | 52 |
| 1985 జనవరి | 4 | 6 | 41 | 5 | 55 |
| | 9 | 6 | 43 | 5 | 58 |
| | 14 | 6 | 44 | 6 | 00 |
| | 19 | 6 | 45 | 6 | 03 |
| | 24 | 6 | 46 | 6 | 06 |
| | 29 | 6 | 45 | 6 | 08 |
| ఫిబ్రవరి | 3 | 6 | 44 | 6 | 10 |
| | 8 | 6 | 42 | 6 | 12 |
| | 13 | 6 | 41 | 6 | 14 |
| | 18 | 6 | 38 | 6 | 16 |
| | 23 | 6 | 36 | 6 | 17 |
| | 28 | 6 | 33 | 6 | 18 |
| మార్చి | 5 | 6 | 30 | 6 | 18 |
| | 10 | 6 | 27 | 6 | 19 |
| | 15 | 6 | 24 | 6 | 20 |
| | 20 | 6 | 20 | 6 | 20 |
| | 22 | 6 | 19 | 6 | 21 |

# అథ బ్రహ్మణః ఆయుఃప్రమాణాదికం

శ్రీమద్భగవద్దివ్యనాభీకమలజాతస్య పరార్థద్వయజీవినః చతుర్ముఖస్య బ్రహ్మణః పరమాయుర్వర్షశతమేవ। తత్పరిమాణసౌరాబ్దాః 31104000 కోట్లయః। వర్తమాన బ్రహ్మణః పరాఖ్యస్యాయుషః అర్థంగతం। ద్వితీయపరార్థే ప్రథమవాసరే గతఘట్యాదయః। ఘ॥ 17 విఘ॥ 42 ప్రాణకాల (౦) గుర్వక్షరోచ్చారకాలః 3 నిమేష 19 లవ 18 త్రుటయః 98 సంప్రతి ఏకోనశతతమే త్రుటౌగత సౌరామాసాదయః 5-14-48-10. బ్రహ్మణః సౌరమానేన వయోగతవత్సరాః 1,55,52,195,85 వత్సరాః। ఇదానీం శ్వేతవరాహకల్పే స్వాయంభువాద్యాః షణ్మనవో గతాః। సప్తమే వైవస్వతమన్వంతరే 2( మహాయుగాని గతాని। మహాయుగ ప్రమాణ సం॥ 4320000, కృతయుగ ప్ర. సం॥ 1728000, త్రేతాయుగ ప్ర. సం॥ 1296,000 ద్వాపరయుగ ప్ర. సం॥ 864000, కలియుగ ప్ర. సం॥ 432000, సృష్టికాలాత్పరిగ్ప్రిహ్మధ్యానగతవత్సరాః 195,58,85,085, కలియుగే గతాబ్దాః 5085 శాలివాహనశకేగతాబ్దాః 1906 విక్రమశకే గతాబ్దాః 2041, ఇంగ్లీషు 1984-1985.

మహాయుగము అనగా 4320000 సంవత్సరముల పరిమాణముగలది. అది కృతా, త్రేతా, ద్వాపర, కలియుగములు అనునామములతో విభాగింపబడి వ్యవహరింపబడుచున్నది. "యుగం భవేత్ వత్సరపంచకేన యుగాని తు ద్వాదశ వర్షషష్ట్యాం" ఇత్యాది శాస్త్రవచనములు. ప్రభవాది షష్టిసంవత్సరములలో అయిదు సంవత్సరములు ఒకయుగము. అట్టియుగసంఖ్యచే షష్టిసంవత్సరములు (5×12=60) 12 యుగములుగానగుచున్నవి అవిచెప్పుచున్నవి, అట్లు యుగముగానైన అయిదు సంవత్సరములను గూర్చి కృష్ణయజుర్వేదము (తైత్తిరీయ బ్రాహ్మణము) కాఠకప్రశ్నము నాల్గవ అనువాకమునందు.

"సంవత్సరో౽సి[1], పరివత్సరో౽సి[2], ఇదావత్సరో౽సి[3], ఇదువత్సరో౽సి[4], ఇద్వత్సరో౽సి[5]" వత్సరో౽సి[6] ॥ ఇతి ॥ ఇట్లు చెప్పుచున్నది.

ఇందులకు విద్యారణ్యభాష్యము,

ప్రభవాదిషు షష్టిసంవత్సరేషు ఏకైకస్మింశ్చ క్రమేణ సంవత్సర పరివత్సరాది శబ్దాః వర్తన్తే, ................................................పంచస్వేతేష్వనుగతాకారః వత్సరః। ఏతద్రూపో౽సి. ఏవమంగిరశ్శ్రీముఖ భావ యుగాదిషు ఏకాదశసు పంచకేషు యోజయితవ్యం ॥ ఇతి ॥ అని చెప్పుచున్నది.

అనగా, ప్రభవాది అయిదు సంవత్సరములు, "సంవత్సరము, పరివత్సరము, ఇదావత్సరము, ఇదువత్సరము, ఇద్వత్సరము" అను నామములుకలవై యున్నవి. ఇటులనే మిగతా ప్రతి అయిదు సంవత్సరములకు నామములను తెలియదగియున్నది. ఇటుల లెక్కించిన ఈ రక్తాక్షినామసంవత్సరము ప్రభవాదిగా 58 వ సంవత్సరమగుటచే పన్నెండవ యుగములో తృతీయ వత్సరమగుచున్నది. దీనిని ఇదావత్సర శబ్దముచే వైదికులు వ్యవహరించుచున్నారు. ఇది చంద్ర దేవతాకమగుచున్నది – ఇదావత్సరమని పేరుగల ఈ సంవత్సరమున వస్త్రదానము విశేష ఫలదమగును.

దయాసముద్రుడగు శ్రీ వేంకటేశప్రభువు యొక్క అనుగ్రహ పాత్రులకు వారలకు అన్నియు శుభప్రదములుగాను సుఖప్రదములుగాను ఉండునని తలంచవలసియున్నది.

శ్రీ వేంకటేశ్వరాయ నమః

# శ్రీ రక్తాక్షినామ సంవత్సర పంచాఙ్గ పీఠికా

కల్యాద్యబ్దాః ౫౦౮౫, శాలివాహన శకాబ్దాః ౧౯౦౬, విక్రమార్క శకాబ్దాః ౨౦౪౧, శ్రీ శంకరాచార్యస్వామ్యవతారాబ్దాః ౨౦౫౬, శ్రీ రామానుజస్వామ్యవతారాబ్దాః ౯౬౭, శ్రీ మధ్వాచార్యావతారాబ్దాః ౭౬౬. ఫసలీశకాబ్దా ౧౩౯౩-౯౪, హిజరీశకాబ్దాః ౧౪౦౪-౧౪౦౫, ఇంగ్లీషు 1984-85, భారతీయస్వతంత్రాబ్దాః ౩౭, ఆంధ్రరాష్ట్రావతారాబ్దాః ౩౨, ప్రభవాదిగతాబ్దాః 58, ఏష్యాబ్దాః 2.

## సంవత్సర ఫలము

ఈ సంవత్సరమందు సంవత్సరాధిపతి చంద్రుడు, మంత్రి-శుక్రుడు, సేనాధిపతి-శుక్రుడు, సస్యాధిపతి-చంద్రుడు, ధాన్యాధిపతి-శని, అర్ఘాధిపతి-గురుడు, మేఘాధిపతి-గురుడు, రసాధిపతి-బుధుడు, నీరసాధిపతి-చంద్రుడు, సంవత్సరలగ్న జగల్లగ్నాధిపతులు బుధుడు. 3 కుంచములు వర్షము. అందు 7 భాగములు సముద్రములందును, 10 భాగములు పర్వతప్రదేశములందును, 4 భాగములు భూమియందును వర్షించును. పశుపాలకుడు-శ్రీకృష్ణుడు, గోష్ఠాగారప్రాపకుడు-బలరాముడు. గోవులను ఇప్పెడివాడు శ్రీకృష్ణుడు. 18 వీసములలో 14వీసములు పంటలు ఫలించును. ధరలు అధికముగ నుండును.

## మౌఢ్య నిర్ణయము

వైశాఖ శుద్ధ ౧౩ ఆది (13-5-1984) ప్రభృతి ఆషాఢ బహుళ ౫ బుధ (18-7-84) వరకు శుక్ర మౌఢ్యము. పౌష్య శు ౧౧ బుధ (2-1-1985) ప్రభృతి మాఘ శుద్ధ ౬ ఆది (27-1-85) వరకు గురు మౌఢ్యము.

## కర్తరీ నిర్ణయము

వైశాఖ శుద్ధ ౨ గురు (3-5-84) లగాయితు వైశాఖ బహుళ ౧౩ సోమ (28-5-84) వరకు కర్తరి.

## పుష్కరనిర్ణయము

పౌష బ॥ ౪ గురు॥ (10-1-1985) న శ్రీ తుంగభద్రానదీ, పుష్కర ప్రారంభమగును.

1984 ఏప్రిల్ 2 తేదీన చాంద్రమాన శ్రీ రక్తాక్షి సం॥రం ప్రారంభమగును.

13-4-1984 తేదీన సౌర సంవత్సర ప్రారంభమగును.

21-3-1984 తేదీన 1906 శాలివాహనశక ప్రారంభమగును.

11-1-1984 సావన వర్షారంభము (గత రుధిరోద్గారి సం॥రం పుష్య శుద్ధ ౮ బుధ॥న)

18-3-1984 గత సం॥రం ఫాల్గుణ బ॥ ౧ ఆదివారము లగాయితు 7-3-85 వ బార్హస్పత్య మానముచేత ఈశ్వరనామ సంవత్సరము.

రాబోవు శ్రీ క్రోధననామ సంవత్సరమునందు శ్రావణమాసమధికమగును.

## కార్తె ప్రవేశములు — వర్షనిర్ణయము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1984 ఏప్రిల్ | 27 | భరణి | ఉ. | గం, | 7—0 | అనావృష్టి |
| మే | 11 | కృత్తిక | రా. | గం. | 2—3 | అనావృష్టి |
| | 24 | రోహిణి | రా. | గం. | 11—23 | అనావృష్టి |
| జూన్ | 7 | మృగశిర | రా. | గం. | 11—0 | స్వల్పవృష్టి |
| | 21 | ఆర్ద్ర | రా. | గం. | 11—56 | సువృష్టి |
| జూలై | 5 | పునర్వసు | రా. | గం. | 1—40 | సువృష్టి |
| | 19 | పుష్యమి | రా. | గం. | 3—10 | చిత్రవృష్టి |
| ఆగష్టు | 2 | ఆశ్లేష | రా. | గం. | 3—31 | చిత్రాల్పవృష్టి |
| | 16 | మఘ | రా. | గం. | 2—14 | స్వల్పవృష్టి |
| | 30 | పుబ్బ | రా. | గం. | 10—41 | చిత్రవృష్టి |
| సెప్టెం | 13 | ఉత్తర | సా. | గం. | 4—30 | సువృష్టి |
| | 27 | హస్త | ఉ. | గం. | 7—13 | చిత్రవృష్టి |
| అక్టో | 10 | చిత్ర | రా. | గం. | 7—51 | సువృష్టి |
| | 23 | స్వాతి | తె. | గం. | 5—35 | చిత్రాల్పవృష్టి |
| నవం | 6 | విశాఖ | ప. | గం, | 12—36 | చిత్రవృష్టి |
| | 19 | అనూరాధ | సా. | గం. | 5—34 | సువృష్టి |

ఇవి ప్రాయికముగ సరిపడును. మరియు పీఠికలో వర్షయోగ ఫలములను గమనించవలెను.

## సముదాయఫలములు

ఈ సంవత్సరమున నవ నాయకులలో 8 శుభులు. 30 ఆధిపత్యములలో 27 ఆధిపత్యములు శుభులు కలవి. రాత్రియందు ఆర్ద్రా ప్రవేశము. పశుపాలకులును శుభులైరి. బహు దేశములందు సస్యానుకూలముగ వర్షించును. 14/16 వీసములు ఫలించును, దుష్టగ్రహ సంపత్తిగల్గినను సస్యానుకూలముగనే వర్షించును. ఎఱ్ఱని, నల్లని భూమియు మాగాణిభూమియు, ఎఱ్ఱని నల్లని రంగుగల ధాన్యములు స్వల్పకాలపు వరి పంట బాగుగపలించును. రసద్రవ్యములగు మిర్చి, చింతపండు, బెల్లము, నూనెజాతులు, పసుపు, కుంకుమ వీటికి వస్తులోపము కలుగును. వీటికిన్ని సర్వ ధాన్యములకున్నూ గొప్పధరలు నిలచి వుండును. సంవత్సరాంతమునకు ధరలు కొద్దిగ తగ్గుదలలు కలిగియుండును. ఈ సంవత్సరాంతము లగాయితు ధరలు విశేష పంటలుగల్గియు నిత్యావసరవస్తువులు అందుబాటులో నుండుటయు ప్రజామోదకరముగనుండును. మధ్యాంధ్ర ప్రదేశమున సస్యపీడలు మెండుగనుండును. దక్షిణదేశములందును నైఋతిదిశనుగల దేశములందును వర్షాభావము. అన్నలోపము. యుద్ధసూచనలు గల్గును. ప్రభువులు నీతియుక్తముగ పాలనచేయగల్గుదురు. ఆగష్టు సెప్టెంబరు, అక్టోబరు నెలలలో విప్లవములు ప్రకృతిభీభత్సములు గల్గును. శ్రావణ భాద్రపద శుద్ధములందు దక్షిణదేశములందు అతివర్షములు తుఫానులు సంభవించును. ఆశ్వయుజ శు ౫ ప్రాంతమునను కార్తీక శు౧౦ ప్రాంతమునను మధ్యదేశములందు అతివర్షములు తుఫానులు మున్నగు విశేష అరిష్టములు సంభవించును.

వృక్షలతాదులు విరివిగఫలించును. మొదటి పంటలు చాల బాగుగ ఫలించును. 2 వ పంటకు కీటకబాధలచే పీడలు కల్గును. గత 7 సంవత్సరముల నుండి గల్గిన అధిక ధరలవలనను అతి వర్షణముచేతను గల్గిన వచ్చియు సంవత్సరాంతము లగాయితు అట్టి బాధలులేక సంతుష్టికరముగ యుండును. భాద్రపద ఆశ్వయుజ మాసములలో రోగబాధలు విస్తారముగ యుండును. ప్రజలు ప్రభువులు ధర్మమార్గానుసారులై వుందురు. పంటలు విశేషముగ ఫలించి ఆహారసమృద్ధిగల్గి ప్రజలు సుఖించెదరు.

## అబ్దత్రయఫల నిరూపణమ్

అస్మిన్దేశేలోకవ్యవహారార్థం చైత్ర శు ౧ సో॥వారే (2-4-1984) చంద్రమానేన శ్రీరక్తాక్షినామ సం॥ర ప్రారంభః చైత్రి శు ౧౨ శుక్ర (13-4-1984)రే సౌరమాన రక్తాక్షినామ సంవత్సర ప్రారంభః। వింధ్యాద్రేః ఉత్తరదిశి శ్రీకాశీప్రాంతే గతసంవత్సర ఫాల్గుణ బ ౧ ఆది ప్రభృతి ఈశ్వరనామ సంవత్సరః। గురూదయవశాత్ అస్మిన్నబ్దేఫల ప్రదర్శనార్థం సర్వత్ర ఆషాఢాబ్దః॥

## చాంద్ర సౌరమానాబ్దఫలం

రక్తాక్షివర్షే సతతం మహీశాః పురస్పరం క్రోధముఖాః ప్రమత్తాః।
విశ్వంభరా ఉత్తమసస్య పూర్ణా క్వచిద్భవేత్ ధాన్యవిహీనసస్యా॥

ప్రభువులకు యుద్ధములు చెలరేగును. సర్వదేశములందును, సమృద్ధిగ పంటలు ఫలించును. దక్షిణదేశములందు కొద్ది ప్రాంతములందు పంటలకు చెఱుపులు గలుగును.

## బార్హస్పత్యమానాబ్దఫలం

ఈశ్వరాబ్దే ఽఖిలాఃక్ష్మేశాః జగదానంది నీధరాః।
అధ్వరేనిరతాః విప్రాః స్వస్వమార్గరతాః పరే॥

ప్రభువులు. స్వచ్ఛచిత్తముగల వారగుదురు. ప్రజలు ధర్మ మార్గనిరతులగుదురు.

## గురూదయాబ్దఫలం

ఆషాఢాబ్దే ప్రచురం పీడ్యంతే సర్వసస్యాని।
కేటా ద్వైరఫలం త్వపరం సస్యంచ వృద్ధిమాప్నోతి॥

సస్యపీడలు విస్తారముగా కల్గును - రెండవపంట బాగుండును.

## శ్రీ రక్తాక్షిసంవత్సరస్య రాజాదినిర్ణయః

| | | |
|---|---|---|
| రాజా-చంద్రః | సస్యాధిపతి-చంద్రః | మేఘాధిపతిః-గురుః |
| మంత్రీ-శుక్రః | ధాన్యాధిపతిః-శనిః | రసాధిపతిః-బుధః |
| సేనానాయక-శుక్రః | అర్ఘాధిపతిః-గురుః | నీరసాధిపతిః-చంద్రః |

## ఉపనాయకనిర్ణయః

| | | |
|---|---|---|
| పురోహితః_చంద్రః | గజాధిపతిః_చంద్రః | జంగమాధిపతిః_చంద్రః |
| పరీక్షకః_చంద్రః | పశూనామధిపతిః_గురుః | పర్వాధిపతిః_కుజః |
| గణకః_కుజః | దేవాధిపతిః_చంద్రః | మృగాధిపతిః_గురుః |
| గ్రామపాలకః_శుక్రః | నరాధిపతిః_శుక్రః | శుభాధిపతిః_చంద్రః |
| దైవజ్ఞః_గురుః | గ్రామనాయకః_చంద్రః | స్త్రీణామధిపతిః_గురుః |
| రాష్ట్రాధిపతిః_చంద్రః | వస్త్రాధిపతిః_బుధః | వర్షలగ్నం_కన్యా |
| సర్వదేశోద్యోగాధిపతిః_శుక్రః | రత్నాధిపతిః_గురుః | జగల్లగ్నం_కన్యా |
| అశ్వాధిపతిః_శుక్రః | వృక్షాధిపతిః_శనిః | |

వర్షలగ్నాధిపతిః, జగల్లగ్నాధిపతిశ్చ బుధ ఏవ.

## 11_1_1984 న సావన వర్షారంభః

సావనవర్ష మనగా 60 ఘడియలు లేక 24 గంటలు ప్రమాణముగల 360 దినములతో 1 సంవత్సరమగును. ఇది సృష్ట్యాది కాలగుణకమునకు, రవ్యాది గ్రహములకు గణితక్రమమును తెలుపునది యగును.

### సావనవర్షాధిపతిః గురుః ఫలం

వర్షాధిపతౌ జీవే వర్షాధిక్యం చ సర్వసస్యానామ్ ।
ధాన్యార్ఘవృద్ధిరతులా సుభిక్షమతులం సుఖం ద్విజాతీనామ్ ॥

వర్షము లధికము, సస్యాభివృద్ధిగల్గును, ధాన్యములకున్నూ ధర లధికము, సుభిక్షములు, విప్రవృద్ధియు గలుగును.

### శ్రీ కృష్ణః పశుపాలకః ఫలం

పశువృద్ధిస్సుభిక్షం చ బహుసస్యార్ఘసంపదః ।
సంపూర్ణతృణవృద్ధిశ్చ గోపాలే పశునాయకే ॥

### గోష్ఠాగారప్రాపకః బలరామః ఫలం

గవాం సస్యాభివృద్ధిస్స్యాత్ వృష్టిస్సస్యోచితా భవేత్ ।
గోష్ఠాగారప్రాపకేతు బలరామేన్నృణాం సుఖమ్ ॥

### గోష్ఠబహిష్కర్తా శ్రీకృష్ణః ఫలం

బహుక్షీరప్రదా గావః సర్వావ్యాధివివర్జితాః ।
గోష్ఠాద్బహిః ప్రాపణం తు శ్రీకృష్ణేన కృతం యది ॥

పశుపాలక, గోష్ఠాగారప్రాపక, గోష్ఠబహిష్కర్తలు శుభులగుటచే పశువులు సుభిక్షారోగ్యములు గల్గియు, ధరల కాధిక్యత గల్గియు, సస్యానుకూలతయు గల్గి వుండును.

## వర్షాధకస్థితి

వత్సరాది లగాయితు చైత్ర బహుళ ౧౧ గురు వరకు వృద్ధగోపహస్తమందుము, చైత్ర బ ౧౧ గురు ప్రభృతి భాద్రపద బ ౧౩ అది వరకు యావనవయస్క గోపహస్తమునందును, తదాది మార్గశిర బ ౧౪ శుక్ర వరకు వృద్ధగోపహస్తమునందును తదాది ఆ వత్సరము, బాలగోపాలహస్తమునందుము వర్షాధక ముందుటచే సుభిక్షములు, సస్యానుకూలతయు గల్గియుండును.

## అధకప్రమాణము

శతయోజనమౌన్నత్యం విస్తీర్ణం తు శతద్వయమ్ ।
అధకస్య ప్రమాణం తు దేవమానేన గణ్యతే ॥

దేవమానముచేత 200 యోజనముల ఎత్తును, 100 యోజనముల విస్తీర్ణమును, 8 కుంచముల వర్షము గలుగును.

## భాగనిర్ణయము

సప్తభాగాన్సముద్రేషు పర్వతేషు తథాదశ ।
చతుర్భాగాః ధరణ్యాంస్మ్యరేవం వర్షతి చత్రిధా ॥

అందు 7 భాగములు సముద్రములయందును, 10 భాగములు మెట్టప్రదేశములందును, 4 భాగములు భూభాగమునందును వర్షించును.

## మేఘాదినిర్ణయము – ఫలములు

| | | |
|---|---|---|
| సంవర్తనామకమేఘము | = | వాయుపీడలు విస్తారము – అతివర్షములు. |
| వివహనామకవాయువు | = | వృష్టికి ప్రతిబంధకములు |
| నిశ్చలమెఱుపు | = | గొప్పధరలు |
| అసితనామకగర్జితులు | = | సస్యానుకూల వర్షములు |
| క్షీరనామకసముద్రుడు | = | సుభిక్షములు. |

## పద్మకశేషుడు భూమిని వహించుటచే ఫలం

పద్మకే భూమివాహేతు వాగేస్యాదుత్తమమ్ ।
ప్రజానాం సుఖమత్యంతం చారోగ్యంజాయతే ధ్రువమ్ ॥

అన్నిపంటలు విస్తారముగ ఫలించును. ప్రజాసౌఖ్యములు, ఆరోగ్యాభివృద్ధియు నుండును.

## వర్షధాన్యాది ప్రమాణాని

(౧౯) వర్షం ౧౬ ధాన్యం ౧౫ శీతం ౧౩ తృణం ౧౬ ఉష్ణం ౧౯ మారుతః ౬ ప్రజావృద్ధిః ౧౫ నాశః ౧౫ రాజవిద్వరం ౧౧ ఉగ్రం ౫ పుణ్యం ౫ పాపం ౫ (౨౧) వ్యాధి ౬ ఉపశమనం ౧౬ ఆచారః ౧౬ అనాచారః ౧౧ మరణాని ౨౧ జన్మాని ౧౬ దేశోపప్లవః ౧౯ దేశస్వాస్థ్యం ౧౩ చోరభయం౧౯ నాశః ౬ అగ్నిభయం ౬ నాశః ౧౧ మృగోపద్రవః ౧౯ నాశః ౧౫ కీటకవృద్ధి ౧౬ నాశః ౯ మహిష ౯

నాశః ౧౯ సర్వ ౪ నాశః ౧౯ కామః ౧౧ లోభః ౧౫ మోహః ౧౫ మదః ౧౧ మత్సరః ౨౧ సుఖం ౧౧ దుఃఖం ౧౫ భోగః ౧౭ విడంబః ౧౭ మనోవ్యథా ౧౫ ద్వేషః ౧౧ ప్రతిష్ఠా ౫ అప్రతిష్ఠా ౧౫ ద్యూతః౭ ప్రమాదః ౧౫ సరోత్పత్తిః ౫ ప్రీత్యుత్పత్తిః ౧౧ ధాతువాదః ౧౭ భయం ౫ శౌర్యం ౯ దుష్టనిగ్రహః ౧౩ శిష్టప్రతిపాలనం ౧౭ సత్యం ౨౧ అసత్యం ౭ విశ్వాసః ౯ అవిశ్వాసః ౧౧ దయా ౧౩ నిర్దయా ౧౫ న్యాయః ౧౭ అన్యాయః ౧౯(౧౨) గోమాయు ౭ నాశః ౯ సస్యకీటక ౧౧ నాశః ౧౧ శలభః ౧౧ నాశః౧౭ మశక ౩ నాశః ౩ మత్కుణ ౭ నాశః ౯ వృశ్చిక ౧౧ నాశః ౧౧ వ్యాఘ్ర ౩ నాశః ౭ సస్య ౬ నాశః ౮ శుక ౭ నాశః ౬ పిక ౫ నాశః ౭ మకుట ౮ నాశః ౮ (౬) ఖగ ౬ నాశః ౪ గో ౩ నాశః ౪మహిష ౫ నాశః ౨ మృగ ౫ నాశః ౬ అజ ౪ నాశః ౪ అశ్వ ౨ నాశః ౨ గజ ౬ నాశః ౬ ఉష్ట్రీ ౪ నాశః ౬ విప్ర౪ నాశః ౪ క్షత్రియ ౫ నాశః ౩ వైశ్య ౬ నాశః ౨ శూద్ర ౫ నాశః ౬ మ్లేచ్ఛ ౩ నాశః ౩ సంకర౪ నాశః ౩ వజ్రం ౬ నాశః ౫ గోమేధిక ౫ పుష్యరాగ౨ మరకత ౬ మాణిక్య ౪ నీల ౭ మౌక్తిక ౧ ప్రవాళ ౧(౧౯) సువర్ణ ౧౨ రజత ౧౦ తామ్ర ౮ కాంస్య ౧౨ లోహ ౧౪ అయో ౨ త్రపు ౧౦ సీస ౧౦ రస ౬ (౧౯) జ్ఞానం ౧౧ అజ్ఞానం ౧౯ కాపట్యం ౧౩ నిష్కాపట్యం ౯ ధార్మికత్వం ౧ అధార్మికత్వం ౧ విద్యుత్ ౪ శిలాపాతః ౪ గర్జితం ౨ (౧౪) స్వప్నం ౧౨ సుషుప్తి ౧౦ జాగ్రత్ ౮ (౧౯) అండజ ౧౭ నాశః ౧౫ స్వేదజ ౧౩ నాశః ౧౭ ఉద్భిద ౧౯ నాశః ౭ జరాయుజ ౧౫ నాశః ౧౫ స్థావర ౧౧ నాశః ౫ (౧౮) వ్రీహి ౬ శాలి ౮ కులుత్థ ౧౮తిల ౧౮ మాష ౧౨ ముద్గ ౧౦ సర్షప ౧౮ చణక ౪ ఆఢక ౧౬ గోధూమ ౬ కోద్రవ ౧౮ ప్రియంగు ౧౬ యామ నాళ ౧౦ శ్యామాక ౫౪ రాజమాష ౪ నీవార ౧౮ శింబి ౧౦ (౧౯) అతివృష్టి ౭ అనావృష్టి ౯ స్వచక్రభయం ౧౯ పరచక్రభయం ౧౯ (౧౪) క్షుత ౩ తృష్ణా ౫ నిద్రా ౭ ఆలస్యం ౧౩ ఉద్యోగః ౭ మిత్ర భేదః ౧౫ మైత్రీ ౫ రసనిష్పత్తిః ౭ ఫలనిష్పత్తి ౧౧ ఉత్సాహః ౯ ప్రాణిసౌఖ్యం ౧.

---

## నవనాయకఫలాని

### రాజా చంద్రః - ఫలం

చంద్రే నృపే మంగళశోభనాని ప్రభూతవృష్టిః
ప్రచురం చ ధాన్యం సౌఖ్యం జనానాముదయో ।
నృపాణాం ప్రశామ్యతి వ్యాధిజరాః ప్రజానామ్ ॥

ఎల్లప్పుడు శుభకార్యములు, ధాన్యవృద్ధియు, ప్రజాసౌఖ్యములు, ప్రభువులకు స్థిరత్వములు గల్గును.

### మంత్రీ శుక్రః - ఫలం

భృగుసుతే సను మంత్రిపదం గతే శలభమూషకకీటకదోషదః భవతి ।
ధాన్యసమర్ఘతయాఽమలం జనపదేషు జలం సరితోఽధికమ్ ॥

వర్షమగు జలసమృద్ధియు, ధాన్యములకు ధరలు సమత్వము, సస్యములకు శలభ, మూషక కీటకాది బాధలు గల్గియుండును.

## సేనాధిపతిః శుక్రః – ఫలం

యది సేనాధిపః కావ్యః నాఽల్పవృష్ట్యర్ఘవృద్ధయః ।
స్త్రీపుంసయోస్సదా ప్రీతిః అన్యోన్యమదనోత్సవైః ॥

వర్షములు, ధరలు, సస్యములు చాలా విస్తారముగ ఉండును.

## సస్యాధిపతిః చంద్రః – ఫలం

జలధాన్యాని సర్వాణి స్థలధాన్యాని యాని చ ।
వృక్షసస్యాభివృద్ధిస్స్యాచ్చంద్రే సస్యాధిపే సతి ॥

సమస్త మెట్టభూముల పంటలు, పల్లపుభూముల పంటలు, వృక్షలతాదులు విరివిగ ఫలించును.

## ధాన్యాధిపతిః శనిః – ఫలం

కృష్ణధాన్యాని సర్వాణి సూక్ష్మధాన్యాని యాని చ ।
కృష్ణభూమిస్సుఫలితా మం ధాన్యాధిపే సతి ॥

నల్లని ధాన్యములు నల్లని భూమియు స్వల్పకాలపు వరిపంటలు మిక్కిలి ఫలించును.

## అర్ఘాధిపతిః గురుః – ఫలం

శృతివిచారపరాః నరపాలకాః రససమృద్ధియుతా ఖిల మానవాః ।
గురుదతి ప్రియవృష్టికరస్సదా ఖిల విలాసవతీధరణీ తధా ॥

అనుకూల వర్షములు కురియును. భూమి సస్యసమృద్ధితో నిండియుండును. ప్రభువులు దేవతా కర్మయం దాసక్తి కలవారగుదురు. సర్వరసద్రవ్యములు వస్తుసమృద్ధి గల్గియుండును.

## మేఘాధిపతి గురుః – ఫలం

సస్యార్ఘవృష్టిభిస్తుష్టాభవేద్ధాత్రీ నిరంతరం ।
పీతరోగభయాస్సర్వే గురౌ మేఘాధిపే సతి ॥

సర్వదేశములందును సస్యానుకూల వర్షములు, మంచివాతావరణములు గలిగి భూమి ఆనంద కరముగ ప్రకాశించును. ప్రజలకు చక్కని ఆరోగ్యములు గలుగును.

## రసాధిపతిః బుధః – ఫలం

మాలతీమాగధీజాజీఫలకర్పూరగుగ్గులాః ।
గుడాదిరసవృద్ధిస్స్యాత్ బుధే యది రసాధిపే ॥

రసద్రవ్యాధిపతి బుధుడైనందున మాగధీ, మాలతి, జాజీఫల, కర్పూరగుగ్గుల మున్నగునవియు బెల్లము, నానాజాతులు, నేయి, మిర్చి, చింతపండు మున్నగు రసద్రవ్యములు సమృద్ధిగలిగి ధరలతో ప్రకాశించును.

## నీరసాధిపతిః చంద్రః – ఫలం

శుక్లవర్ణాదివస్త్రానాం ముక్తారజతవాససామ్ ।
అర్ఘవృద్ధిః ప్రజాయేత శశాంకే నీరసాధిపే ॥

## పురోహితాద్యధిపతుల ఫలములు

వీరలు క్రూరులగుచో క్రూరఫలములు, శుభులగుచో శుభఫలితములు సంభవించును.

## రవిచారఫలాని

చైత్ర శు॥ ౧౩ శుక్రవాసరే రవేః మేషరాశిప్రవేశః మ, ౨౧-౩౩ పగలు గం॥ 2-48
సస్యవృద్ధియు, వ్యాధిభయములు, ప్రజలకు పీడలు, గల్గును

## ఆర్ద్రాప్రవేశకాలతిథ్యాది ఫలం

తిథిఫలం = అష్టమ్యాం అల్పవృష్టిస్స్యాత్

వారఫలం = గురౌ చార్ఘ సమృద్ధిదః ।

నక్షత్రఫలం = ఉత్తరాభాద్రభే వృష్టిః

యోగఫలం = సౌభాగ్యే శుభదః

కరణఫలం = కౌలవే వృష్టికృత్సదా ।

కాలఫలం = క్షేమం సుభిక్షం సుఖమర్ధరాత్రౌ ।

లగ్నఫలం = తులావృష్టిం ప్రకుర్వతత్.

## షణ్మండల ఫలం

ఆర్ద్రాప్రవేశే సూర్యస్య చంద్రోవస్యాది షణ్మితే ।
షష్ఠే తు మండలే తిష్ఠన్ సుభిక్షారోగ్యదాయకః ॥

సుభిక్షములు, ఆరోగ్యములు, గలిగి ఆనందకరముగనుండును.

## చంద్రచార ఫలాని

## జ్యేష్ఠశుక్ల ప్రతిపద్యుక్త వారఫలం

సుభిక్షం క్షేమమారోగ్యం వృష్టే స్సస్య వివర్ధనమ్ ।
ప్రజారోగ్యం సదానందః జ్యేష్ఠాదౌ గురువాసరే ॥

## ఆషాఢ శుక్ల పంచమీయుత తిథిఫలం

ఆషాఢసిత పంచమ్యాం భౌమవారో భవేద్యది ।
సదా యుద్ధాదిబాధాశ్చ ప్రజానాం పీడనం మహత్ ॥

యుద్ధ సూచనలు ప్రజాపీడలు తరచు గలుగును.

## ఆషాఢ కృష్ణపక్షే రోహిణీయుత తిథిఫలం

ఆషాఢే కృష్ణ పక్షేతురోహిణ్యే కాదశీయుతా ।
సర్వధాన్యాభివృద్ధి స్స్యాత్ సువృష్టిశ్చ మహీతలే ॥

ఆషాఢమాసమునందు రోహిణి ఏకాదశియందైనందున సర్వధాన్యములు చక్కగ ఫలించును సువృష్టిగ సంభవించును.

## ఆషాఢ శుక్లమునస్వాతీయుత తిథిఫలం

ఆషాఢ శుక్లపక్షే తు దశమీ యది సంయుతా ।
స్వాతీయుక్తేన చంద్రేణ మహద్వర్షం భవేద్ధ్రువమ్ ॥

అషాఢ శుక్ల దశమియందు స్వాతియైనందున అతి వర్షబాధలు తటస్థించును.

## కుజచారఫలం

పూర్వ సంవత్సర ఆషాఢ బ ౮ మంగళవారమున పునర్వసూనక్షత్ర గత కుజోదయము గలిగి ఈ సంవత్సర చైత్రశుక్ల ౫ శుక్రవారమున తదాది పదకొండవ నక్షత్రమున వక్రించుటవలన కుజునికి వ్యాళసంజ్ఞికము గలిగెను. ఇందుచే రసద్రవ్యములకు హానికరములగు వర్షములు కురియును. వైశాఖ శు ౨ మం॥ ప్రభృతి భాద్రపద బ ౩౦ మం॥ వరకు వృశ్చికరాశియందు కుజవక్రముగలుగుటచే-

చోరాగ్నిభీతిః నృపదుష్టనీతిః నిష్పత్తిరన్నస్య చ వృశ్చికస్థే ॥

చోరాగ్నిబాధలు ప్రభువులకు దురాలోచనలు అన్నసమృద్ధియు గలుగును.

## గురుచారఃఫలం

వత్సరాది ప్ర॥ పుష్య బ ౪ గురు॥ ప॥ ధనూరాశౌ గురుసంచారః

ఫలం॥ వీతరోగభయా స్సర్వే చాపస్థే దేవపూజితే ।
హృదయానందినీ ధాత్రీ ఫలశాలి సువృష్టిభిః ॥

ఈ కాలమునందు రోగబాధలుండవు. భూమి సస్యరమణీయముగ కూడి ధాన్య ఫల సువృష్టులచే ప్రకాశించును పుష్య బ ౪ గురు॥ ప్ర॥ ఆ వత్సరము మకరరాశిస్థితిః శతయోజనా ధాత్రీ పూర్ణసస్యార్ఘ వృష్టిభిః వీతరోగభయాస్సర్వే మకరస్థే సురార్చితే ఈ కాలమందును సస్యాభివృద్ధిగల్గి అనుకూలవాతావరణములు గల్గివుండును.

## శుక్రసంచారఫలం

వైశాఖ శు ౧౩ ఆది॥ భరణీ నక్షత్రాగత శుక్రాస్తమయము గలుగుటచే ధరలు మరింత హెచ్చును. ఆషాఢ శుక్ల ౫ బుధ॥ కర్కాటకలగ్న పుష్యమీ నక్షత్రముయందు శుక్రోదయముగల్గుటచే యుద్ధ దుర్భిక్షసూచనలు ఆహారలోపములచే కష్టతరముగ నుండును.

## శనిసంచారఫలం

ఈ సం॥ర మార్గశిర బ॥ ౧౩ శనివార పర్యంతము చిత్రా, స్వాతి, విశాఖనక్షత్రగత తులారాశి యందు శనిసంచారము. గావున, ఈ కాలమునందు గొప్పదరలు, ప్రభువుల కత్యంతారిష్టములు, అన్న లోపములు, చోరాదిబాధలు గల్గివుందును. మార్గశిర బ॥ ౧౩ శని॥ లు॥ ఆ వత్సరము వృశ్చికరాశిస్థితి గల్గి నందున ఈ కాలమునందు ప్రభుగణములకు కోపోద్రిక్తత, అరిష్టములు, ప్రజల కన్నలోపములు, గొప్ప ధరలుగల్గి ప్రజలకనేక కష్టములు గల్గును. వరదలవల్ల ఉత్తరదేశములందు సస్యనష్టములు సంభవించును. నాసిక, సౌరాష్ట్ర, పృథు, మాళవక, కొంకణము మున్నగు నైఋతిదిశనగల దేశములందు అనేక విధములగు ఇక్కట్లు సంభవించును.

## సర్వమాలోచ్య నిశ్చితఫలములు

అస్మిన్నబ్దే తు పూర్వాణాం సస్యానాం వృద్ధిరుత్తమా సర్వమాలోచ్య నిశ్చిత్య సంపూర్ణ ఫల మీరితమ్। ఈసంవత్సరమునందు సర్వవిధములగు గ్రహసంచార ఫలములను విమర్శించగా 18 వీసములు ఫలించి అందు 14 వీసములు పంటలు ప్రజలకు నిలబడును.

## మకరసంక్రమణ పురుషలక్షణము

పుష్య బ॥ ౩ ఆది ॥రే॥ రవేః మకరరాశి ప్రవేశః తె॥ 6-26

అష్టకర్ణో విశాలాక్షోలంబభూర్దీర్ఘ నాసికః।
అష్టబాహుశ్చ తుర్వక్త్రస్సంక్రాంతి పురుషస్మృతః।
శతయోజన మౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశస్మృతం।
ఏవంరూపంహి విజ్ఞేయా సంక్రాంతిపురుషస్యతు ॥

అస్యపురుషస్య ధ్వాంక్షనామధేయం - విటానామరిష్టం। చందనోదకస్నానము - ఆరోగ్యము। యామనాళాక్షత ధారణము - యామనాళ (జొన్నలు) అరిష్టము। రక్త వస్త్రం - యుద్ధం। చందనగంధః - ఆరోగ్యం। జాజీ పుష్పం - యశోవృద్ధిః। నీలాభరణం - క్షేమం। రజత పాత్రం - రజతనాశః। పాయసభోజనం - దుర్భిక్షం। కదళీఫలం - ఆరోగ్యం। వ్యాఘ్రవాహనం - మృగనాశః। భిండివాలాయుధం - రాజ్ఞామరిష్టాని। రక్తఛత్రం - యుద్ధ భయాని। ఖడ్గధారణం - గదాయుద్ధం। యామ్యదిగ్యానం తద్దేశారిష్టం। క్రోధముఖీచేష్టా - ప్రజానాశః। నివిష్టోభవతి సస్యవృద్ధిః॥



## పక్షఫలం

కృష్ణపక్షే యదా పౌషే మకరస్థో దివాకరః।
సువృష్టిః క్షేమమారోగ్యం వర్ధనం సస్యసంపదామ్॥
సస్యసమృద్ధి సస్యానుకూల వర్షములు కురియును.

## తిథ్యాదిఫలం

| | | |
|---|---|---|
| తిథిఫలం | — | ధరాభివృద్ధిః |
| వారఫలం | — | సుభిక్షం |
| నక్షత్రఫలం | — | గోపీడనం |
| యోగఫలం | — | సుకర్మే వృద్ధిః |
| కరణఫలం | — | బాలవే తు సుభిక్షం స్యాత్ |
| లగ్నఫలం | — | సంపూర్ణఫలదా ధాత్రీ |
| ముహూర్తఫలం | — | త్రింశతౌ శుభదం భవేత్ |
| కాలఫలం | — | ప్రభాతే గోపపీడనం । సంధ్యాయాం గోవృషధ్వంసీ ॥ |

## ఫలశ్రుతిః

శ్లో॥ సంక్రాంతి పురుషోత్పత్తికాలే దానం స్వశక్తితః ।
ఫలం కాంస్యాది ధాన్యాది దీయతే దోషనాశనమ్ ॥

ఫలాని మూలాన్యజినం సువర్ణం గ్రామాం శుకాద్యం సతిలేషు గావః ।
ధాన్యం ఖరాం శోర్మకరప్రవేశ ఏతాని దానాని విశేషదాని ॥

మకరస్థే తీక్ష్ణభానౌ ధాన్యదానం కరోతి యః ।
తేజస్వీ రూపవాన్మర్త్యః సార్వభౌమః ప్రజాయతే ॥

యశ్శృణోతి మధు శుక్లపక్షకే వర్షవాధ సచివాదిసత్ఫలమ్ ।
ప్రాప్నుయాద్దురితముక్తవిగ్రహాశ్చాయురర్థమతులం యశస్సుఖమ్ ॥

కాలానుపరాగాదీనుక్త్వా పుణ్యాని కారయేద్యస్తు ।
తేషామంశం దశమం నియమేనాప్నోతి దైవజ్ఞః ॥

ఆయుర్వృద్ధిం పుత్రపౌత్రాభివృద్ధిం నిత్యారోగ్యం మంగళం నిర్వ్యపాయమ్ ।
అచ్ఛిన్నానాముత్సవానామవాప్తిం యచ్ఛంత్యేతే వత్సరాధీశ ముఖ్యాః ॥

మకరసంక్రమణ పుణ్యకాలమున యథాశక్తిని కాంస్య, ధాన్య, అజిన, సువర్ణ, ఆజ్య, అంబర దానములను చేసినయెడల ఆయురారోగ్య ఐశ్వర్య పుత్ర పౌత్రాద్యభివృద్ధి గలిగి సుఖమొందగలరు.

## ఆదాయవ్యయములు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషవృశ్చికములకు | ఆ. | ౧౪ | వ్య. | ౨ | ధనుర్మీనములు | ఆ. | ౨ | వ్య. | ౧౧ |
| వృషభ తులలకు | " | ౮ | " | ౧౧ | మకర కుంభములు | " | ౫ | " | ౫ |
| మిథున కన్యలకు | " | ౧౧ | " | ౮ | సర్వాదాయః | | ౫౩ | | |
| కర్కాటక | " | ౫ | " | ౮ | సర్వవ్యయః | | ౪౭ | | |
| సింహము | " | ౮ | " | ౨ | అధికాదాయః | | ౬ | | |

## రాజపూజ్యత్వాఽవమానాని

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషస్య | రా. | ౪ | అ. | ౫ | సింహస్య | రా. | ౨ | అ. | ౪ | ధనుషః | రా. | ౭ | అ. | ౭ |
| వృషభస్య | " | ౭ | " | ౫ | కన్యాయాః | " | ౫ | " | ౪ | మకరస్య | " | ౩ | " | ౩ |
| మిథునస్య | " | ౩ | " | ౧ | తులాయాః | " | ౧ | " | ౭ | కుంభస్య | " | ౬ | " | ౩ |
| కటకస్య | " | ౬ | " | ౧ | వృశ్చికస్య | " | ౪ | " | ౭ | మీనస్య | " | ౨ | " | ౬ |

## కందాయ ఫలములు

| అశ్వి | భర | కృత్తి | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్రే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ |
| **మఖ** | **పుబ్బ** | **ఉత్త** | **హస్త** | **చిత్ర** | **స్వాతి** | **విశా** | **అనూ** | **జ్యేష్ఠ** |
| ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ |
| **మూల** | **పూ-షా** | **ఉ-షా** | **శ్రవణం** | **ధనిష్ఠ** | **శత** | **పూ-భా** | **ఉ-భా** | **రేవతి** |
| ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ |

విషమేష్వర్థలాభస్స్యాత్సమేషు సమతా భవేత్ । శూన్యేషు శూన్యమాప్నోతి కందాయఫలమీదృశమ్ ॥ ఆదిశూన్యే భవేద్వ్యాధి ర్మధ్యశూన్యే మహద్భయమ్ । అంత్యశూన్యే భవేద్ధాని స్త్రిషుశూన్యేషు నిష్ఫలమ్ ॥ ఏకైకస్య చతుర్మాసం కందాయానాం ఫలం క్రమాత్ ॥

## సంవత్సర ఫలము

| | | |
|---|---|---|
| అశ్వినీ, పుష్య, స్వాతి, అభిజిత్తుల వారికి | — | మనస్తాపము |
| భరణి, ఆశ్రేషా, విశాఖ, శ్రవణములవారికి | — | రాజపూజ్యత |
| కృత్తిక, మఖ, అనూరాధా, ధనిష్ఠల వారికి | — | యుద్ధభయము |
| రోహిణీ, పూర్వఫల్గునీ, జ్యేష్ఠ, శతభిషం వారికి | — | అలంకారప్రాప్తి |
| మృగ, ఉ-ఫ, మూల, పూ-భా వారికి | — | రోగభయము |
| ఆర్ద్ర, హస్త, పూ-షా, ఉ-భా వారికి | — | ఆయుర్వృద్ధి |
| పున, చిత్ర, ఉ-షా, రేవతుల వారికి | — | అర్థలాభము |

# 1. వర్ష యోగములు

**చైత్రమాసము:**- ఇందు గురు, శుక్రులకు సౌమ్యదహన నాడులందును మిగిలిన గ్రహములకు వాయు మహావాయు, దహన నాడీసంచారముకలదు. శు ౧౧ల॥ బుధవక్రము, ఋజుశుక్రుడున్ను బ ౫ వ॥ పురోబుధుడున్ను, శు ౧౨ ల బ ౫ వ॥ పురోబుధ రవిమధ్యముకలదు. శుద్ధమున మేఘాడంబరములు, వాయుప్రాబల్యముకల్గి బహుళమున ఖండవృష్టి కల్గును, చాంద్రయోగములచే ఏప్రి 10, 11, 16, 17, 19, 25, 26, 30 తేదీలలో ఖండవృష్టి కల్గును.

**వైశాఖమాసము:**- ఇందుగురునకు సౌమ్యనాడీయందును, మిగిలిన గ్రహములకు వాయు, మహావాయు, నాడీ సంచారముకలదు. శు ౨ అంగారకచలనము, శు ౧౩ శుక్రాస్తమయము, శు ౫ వ॥ బుధ వక్రి ఋజుశుక్రుడున్ను శు ౧౫ల॥ బ ౬ వ బుధ శుక్రసమాగమము, శు ౧౪ల॥ పురో రవి యున్నుగలదు. శుద్ధమునగాలిదుమారములు హెచ్చును. పూర్ణిమాప్రాంతమున ఖండవృష్టికల్గును చాంద్రయోగములచే మే 3, 4, 6, 13, 21, 22, 28, 29 తేదీలలో ఖండవృష్టి కల్గును.

**జ్యేష్ఠమాసము:**- ఇందుగురునకు తప్ప మిగిలిన గ్రహములకువాయు. మహావాయు, దహన, నాడీ సంచారము కలదు. శు ౪ల॥ బ ౧వరకు బుధ శుక్ర సమాగమము బ ౬ల॥ బుధ శుక్రులు లేక రాశిస్థితి ల॥ పురుశుక్ర బుధులు, బ ౩ల॥ బ ౯ వరకు మృగశిరా బుధుడు, ఆర్ద్రా బుధుడు వృష్టి ప్రదములు, బ ౧౦॥ గురు శుక్రసమసప్తకము వర్ష ప్రతిబంధకములు, శుద్ధమున మేఘ ప్రాబల్యముకల్గి, గాలిదుమారములు చెలరేగును. బహుళమున అమావాస్యప్రాంతమున వర్షములు కురియును. చాంద్రయోగములచే జూన్ 1, 2, 9, 10, 12, 13, 19, 20, 24, 25. 29 తేదీలలో వర్ష సూచనలు కల్గును.

**ఆషాఢమాసము:**- ఈ మాసమునందు శని, కుజులకు మహావాయునాడీయందును, మిగిలిన గ్రహములకు రసజల, అమృతనాడీ సంచారము, గలదు. శు ౫ వ బుధ శుక్ర సమాగమము, మొ॥ వర్ష యోగములున్ను శు ౩ ల॥ పురో బుధుడు శు ౧౧ ల॥ బ ౩ వ॥ పుర శుక్రరవిమధ్యము, బ ౭ ల॥ పురోబుధరవి మధ్యము, శు ౧౧ వ గురు శుక్రసమసప్తకము మొ॥ వృష్టి ప్రతి బంధకములుకలవు. బ ౫ శుక్రోదయముకలదు. శుద్ధమున మధ్యవృష్టి బహుళమున వర్షములు కురియును. చాంద్రయోగములచే జూలై 1, 3, 4, 7, 8, 16, 17, 19, 20, 21, 22, 25, 28 తేదీలందు వర్షములు కురియును.

**శ్రావణమాసము:**- ఇందుకుజ శని గురులకు వాయుదహననాడీయందును మిగిలిన గ్రహములకు అమృత జలనాడీసంచారముకలదు. శు ౭ అంగారక చలనము శు ౫ ల॥ ప్రాగ్దిశమాఘాది పంచక శుక్రుడు శు ౫ ల॥ బుధ శుక్రులలేక రాశిస్థితి వృష్టి ప్రదములు. బ ౫ వ॥ పురోబుధుడున్ను బహుళమున అధికవర్షములుకురియును. చాంద్రయోగములచే జూలై 29, 30, అగ 4, 5, 10, 11, 15, 18, 20, 21, 24, 26 తేదీల యందువర్షములుకురియును.

భాద్రపదమాసము :- ఈ మాసమునందు కుజ, గురు, శనులకువాయు, మహావాయు. దహన నాడులందును మిగిలిన గ్రహములకు అమృతజల, రస, సౌమ్యనాడులందును సంచారము కలదు. ఈ మాసముప్రాగ్దిశి మాఘాది పంచక శుక్రుడు బ ౧౦ ల॥ పురశ్శుక్రుడు. శు ౧౨ వ బుధోవక్రి ఋజుశ్శుక్రుడు బ ౬ వ పురశ్శుక్రుడున్ను, బ ౩౦ అంగారకచలనము వృష్టి ప్రదములు, శు౯ వ॥ జ్యేష్ఠాకుజుడు అనావృష్టి ప్రదము. పూర్ణిమా, అమా ప్రాంతములలో వర్షములు కురియును. చాంద్రయోగములచే సెప్టెం, 1, 2, 8, 9, 13 నుండి 17, 20, 21 తేదీలలో వర్షములు కురియును.

ఆశ్వయుజమాసము :- ఇందు దహన, వాయు నాడులందును, మిగిలిన గ్రహములకు రససౌమ్య నాడీ సంచారముకలదు. బ ౭ వ॥ పురశ్శుక్రుడు శు ౧ ల॥ గురుకుజ సమాగమము, మాసమందు ప్రాగ్దిశి స్వాతీత్రయ శుక్రుడున్నుకలవు. శుద్ధమున మధ్యవృష్టి బహుళమున అనావృష్టికల్గును. చాంద్రయోగములచే సెప్టెం 28, అక్టో 1 నుండి 4, 9, 10, 11, 12, 15, 16, 20, 21 తేదీలలో వర్షసూచనలు కల్గును.

కార్తీకమాసము :- కార్తీకమాసమందు గురుకుజులకుసౌమ్యదహన నాడీయందును, మిగిలిన గ్రహములకు వాయు మహావాయునాడీ సంచారముకలదు, శు ౧౪ అంగారక చలనము, శు ౯ ల॥ పూర్ణిమకరకు బుధ శుక్ర సమాగమము, శు ౯ వ॥ పూర్వాషాఢాకుజుడు వృష్టిప్రదములు, శు ౯ ల॥ ఉత్తరాషాఢాకుజుడు, శు ౧౪ వ కుజ గురుసమాగమము శు ౪ వ॥ ప్రాగ్దిశి స్వాతీత్రయ శుక్రుడు అనావృష్టి ప్రదుడు, శుద్ధమున వాయుమిశ్రిత వర్షములుకురియును, పశ్చిమప్రాంతములందు తుఫాను (సూచనలు) కలుగును, భూకంపాదులు కల్గును, చాంద్రయోగములచే అక్టో 28, 29, 30, 31, నవం 7, 8, 12, 13, 15, 16, తేదీలందు ఆకస్మికవర్షముల సూచనలు కల్గును,

మార్గశిరమాసము :- ఈ మాసమందు రవి బుధ శనులకువాయు మహావాయు దహననాడులందును, మిగిలిన గ్రహములకు సౌమ్య, రస, జల అమృతనాడులందును, సంచారముకలదు. బ ౮ వరకు అంగారక చలనము బ ౧౩ శనిచలనము, శు ౨ ల॥ శు ౧౦ వ॥ బుధ శుక్ర సమాగమము, శు ౧౨ ల॥ బుధ వక్రఋజుశ్శుక్రుడున్ను, బ ౭ ల॥ పురోగురుడున్ను కలవు. శుద్ధమున మేఘాడంబరముకల్గి ఖండవృష్టికల్గును. చాంద్రయోగములచే నవం 27,28 డిశం 2,3,7,8,12,13,16,20 తేదీలందు ఈదురుగాలులు, వర్షములు వానివలన నష్టములు కల్గును.

పుష్యమాసము :- ఇందు కుజ గురు శుక్రులకు, అమృత, జల, రస, నాడులందును, మిగిలిన గ్రహములకు వాయుదహన నాడీసంచారముకలవు. శు ౧౧ గుర్వ స్తమయము. బ ౭ ల॥ పురశ్శుక్రుడు శు ౩ వ బుధ వక్రీఋజశ్శుక్రుడున్ను. శు ౭ ల కుజ శుక్రసమాగమము, బ ౬ వ పురో గురుడున్ను కలవు. ఆయాప్రాంతమున ఖండ వృష్టికల్గును, చాంద్రయోగములచే డిశం. 27, 28, జన 1,2,6,7,14,15,21 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలుకల్గును.

మాఘమాసము :- ఇందు శనేతర గ్రహములన్నింటికిన్ని, అమృత, జల. రససౌమ్య, నాడీ సంచారము కలదు. శు ౪ అంగారకచలనము. శు ౬ గురూదయము శు ౫ వ. పురశ్శుక్రుడున్ను, శు ౪ వ

కుజశుక్ర సమాగమము. బ ౬ లి॥ పురశ్శుక్రరవిమధ్యము కలదు. మాసమంతయు మేఘాడంబరముకల్గి స్వల్పవృష్టి కల్గును. చాంద్రయోగములచే జన 25,26,28,29, ఫిబ్ర 1,2,5,8,9,13 14, తేదీలలో స్వల్పవర్షములు కురియును.

**ఫాల్గుణమాసము :–** ఇందు కుజ శుక్ర శనులకు వాయు, మహావాయు, దహన నాడులందును, మిగిలిన గ్రహములకు జలరస, సౌమ్య అమృతనాడీ సంచారము కలదు. శు ౧౪ అంగారక చలనము శు ౧౧ లి॥ శుక్రవక్రి ఋజుశ్శుక్రుడు కలవు. మాసము అంతయు మేఘాడంబరము అనావృష్టి కల్గును. చాంద్రయోగములచే ఫిబ్ర 22,23,27,28 మరియు మార్చి 3,4,8,9.12,13,18,19,21 మరియు 22 తేదీలలో ఖండవృష్టికల్గును.

---

## 2. అర్ఘ యోగములు

**చైత్రమాసము :–** శు ౧౨ నుండి బియ్యము, సైంధవలవణము, ఉల్లిపాయలు, మద్దికి, కంబళ్ళు, గోవులు ఎద్దులు, నువ్వులు, వెండికిన్ని, బహుళ, ౧౨ నుండి కందులు, గోధుమ, అడవిపెసలు, శనగలు నూనె, నెయ్యి, పగడము, కొఱ్ఱలు, బెల్లము, మొదలగువానికి ధరలుపెరుగును. ఈ మాసమంతయు యవ, ధాన్యములకు చక్కెర, పాలు, రసద్రవ్యములకు ధరలు సమము. మాసమంతయు తెల్లబట్టలు, పోకలు, నెయ్యి, పశువులకు, కంచులోహములు, తగరము, బంగారము, వెండి, ఇంగువ, అల్లము, జాజికాయలు ధరలుహెచ్చును. మాసమంతయు ధాన్యము, పసుపు, కొబ్బరి ధరలు నిలబాటు, నూనె, వస్త్రములు, పెసలు, చింతపండు, మినుములు ధరలుపెరుగును.

**వైశాఖమాసము :–** బ ౮ లగాయతు ధాన్యాదులు ధరలుహెచ్చును. బ ౮ వరకు యవలు, గోధుమ ధర హెచ్చును. చెరకు, పాలు, రసద్రవ్యములకు నేయికి ధరసమము. దూది, నూలు, కంచులోహములు. పగడము, నెయ్యి, బంగారము, వెండి, నువ్వులు, నూనె, బెల్లము, మొ॥లగు వానికి ధరహెచ్చును. చక్కెర పోకలు, తెల్లబట్టలు, అపరములకు ధరసమము. పశువులకు, పసుపులకు ధరహెచ్చును. శు ౧౦ నుండి. యవలు, సన్నబియ్యం, గోధుమలు, ధాన్యము, పెసలు, నల్లావాలు, చిరుశనగలు, చక్కెర, పిప్పళ్ళు, వక్కలు, పొట్టుధాన్యము, మొ॥ నవి ధరలుహెచ్చును. బ ౯ నుండి ద్రాక్ష, ఖర్జూరము, వక్కలు, మూలికలు, జాజికాయలు, వడ్లు, యవలు, శనగలు, ధాతుపదార్థములు, అశ్వములు. మణులు, ముత్యములు ధర పెరుగును. బ ౮ లి॥ కందులు, గోధుమ, అడవిపెసలు ధర పెరుగును. శు ౬ లి॥ నువ్వులు, నూనె, పగడములు, నెయ్యి, శనగ, కొఱ్ఱలు, బెల్లము, బ ౩ లి॥ యవలు పెసలు, అవాలు, ధాన్యమునకు ధరలుతగ్గును.

**జ్యేష్ఠమాసము :–** శు ౧౦ లగాయతు ధాన్యాదులకు దూది, నువ్వులు, మినుములు వెల సమము. మాసమంతయు బంగారము, వెండి, దూది, వస్త్రములు, నెయ్యి, నూనె, తగరము, లోహములు కంచు, పగడము, ధాన్యము, పసుపు, బెల్లము, కొబ్బరికాయలు, వేరుశెనగ, చింతపండు ధరలు పెరుగును. శు ౮ నుండి ఏనుగులు, లోహజాతులు, నెయ్యి, వడ్లు, యవలు, శనగలు, అశ్వ

ములు, లోహములు ధరలు పెరుగును. బంగారము, వెండి, ముత్యములు మణులు ధర పెరుగును. బ ౮ లగాయితు వక్కలు, కరక్కాయలు, మూలికలు, జాజికాయలు, టెంకాయలు, పొట్టుధాన్యములు, కంద, పెండలము ధర సమము. శు ౨ లగాయితు యవ, సన్నబియ్యము, పెసలు, నల్లఅవాలు, చిరుశెనగలు, ధాన్యము, కందులు, బియ్యము ధర పెరుగును. శు ౧ లగాయితు జొన్నలు, బియ్యం ధర తగ్గును.

ఆషాఢమాసము :- శు ౧ లగాయితు దూది, నూలు ధర మందము. మాసమంతయు గోధుమ ధర హెచ్చును. బ ౮ లగాయితు ధాన్యాలకు ధర హెచ్చును. దూది, మినుగులు ధర హెచ్చును. పసుపు, కూరలు, ధాన్యము, చింతపండు ధర తగ్గును. నూనెలు, పెసలు మినుగులు, కుంకుళ్ళు, ఇనుము, వస్త్రములు, కంబళ్లు ధర పెరుగును. శు ౬ లగాయితు తెల్ల వస్తువులు, రసద్రవ్యములు, ప్రత్తి, సైంధవలవణము, ఉప్పు ధర తగ్గును. బ ౯ లగాయితు గుగ్గిలం, బెల్లం, లక్క, కర్పూరం, పాదరసము, ఇంగువ, కంచు ధర పెరుగును. శు ౧౪ లగాయితు కందులు, గోధుమ, పెసలు, శనగలు ధర హెచ్చును. బ ౮ లగాయితు పిప్పళ్ళు, వక్కలు, పొట్టుధాన్యములు, మిరియాలు, ఓషధులు ధర పెరుగును. శు ౧౩ లగాయితు కర్పూరం, బెల్లం, పాదరసము మొదలగునవి కొంచెము ధర తగ్గును.

శ్రావణమాసము :- బ ౨ లగాయితు టెంకాయలు, ముత్యములు, రత్నములు ధర తగ్గును. శు ౬ లగాయితు పొట్టుధాన్యములు, మిరియాలు, అడవిపెసలు, ఓషధులు ధరలు తగ్గును. శు ౫ లగాయితు కందులు, గోధుమ, బియ్యము, శనగలు, బంగారము, వెండి, రత్నములు, ముత్యములు ధర పెరుగును. బ ౫ లగాయితు చక్కెర, పిప్పళ్ళు, వక్కలు, పొట్టుధాన్యములు, అడవిపెసలు, మిరియాలు, ఓషధులు ధర హెచ్చును. శు ౧౫ లగాయితు దూదికి, గోధుమలకు ధర హెచ్చును. మాసమంతయు బంగారము మొదలగు లోహములు, నువ్వులు, నూనెలు, బెల్లం, నెయ్యి, ధాన్యము, కందులు, పెసలు, మిర్చి, మినుగులు ధర పెరుగును. నువ్వులు, పసుపు ధర నిలబాటు, బ ౨ లగాయితు టెంకాయలు, ముత్యములు రత్నములు ధర తగ్గును.

భాద్రపదమాసము :- శు ౧ లగాయితు ధాన్యాదులకు ధర హెచ్చును. గోధుమ, చక్కెర ధర సమము. లోహజాతులు, నువ్వులు, నూనె, బెల్లం, హెచ్చుధరలు నిలబడును. పోకలకు, తెల్లబట్టలకు ధర సమముగా నుండును. పసుపు, కొబ్బరి, కుంకుళ్ళు, బెల్లము, ధాన్యము మొదలగునవి ధర నిలబాటు, వాలాజీ, వస్త్రములు, నువ్వులు, చింతపండు, పెసలు, మినుగులు ధర పెరుగును. శు ౪ నుండి మంజిష్ఠ, చెరకు, బెల్లం, చక్కెర, గోధుమ, శొంఠి మిరియాలు, అశ్వ, కొఱ్ఱలు, గుఱ్ఱములు, వస్త్రములు ధర హెచ్చు. బ ౩ లగాయితు నెయ్యి, ముత్యములు, ఆకులు, వక్కలు, కొబ్బరి, కంబళ్ళు, శ్రీఫలం, బంగారం, వెండి, నార, ఆకులు, సజ్జలు, నూనెలు ధర పెరుగును బ ౫ లగాయితు కొఱ్ఱలు, వడ్లు, జాజికాయలు, జాపత్రి, ఓషధులు, దేవదారు, కలపకు ధర తగ్గును.

ఆశ్వయుజమాసము :- శు ౧ లగాయితు పొట్టుధాన్యములకు, మినుములు, పెసర, రసద్రవ్యములకు దూది పగడం, కంచు, లోహములు, నూనెలకు హెచ్చు ధరలు నిలబడును. పప్పు ధాన్యములకు

ధర సమము. శు ౩ లగాయితు బెల్లం, చక్కెర, నువ్వులు, నూనె, నెయ్యి, రత్నములు, ముత్యములు, బంగారము, వెండి, పెసలు, సుగంధద్రవ్యములు, కూరగాయలు, పట్టువస్త్రములు ధర పెరుగును. బ ౧ లగాయితు తేనె, బెల్లం, చక్కెర, నువ్వులు, వడ్లు, నూనెలు, ఉప్పు, మిర్చి, మిరియాలు, రసద్రవ్యములు, ధర హెచ్చును. శు ౮ లి॥ బెల్లం, కండచక్కెర, చక్కెర, నువ్వులు, నూనె, నెయ్యి, సన్నబియ్యము, రత్నములుధర తగ్గును. శు ౧౨ లగాయితు బియ్యము, యవలు, రత్నములు, ముత్యములు, వజ్రములు, నువ్వులు, నూనె, బంగారము, వెండి, ధాతు వస్తువులు ధర తగ్గును. బ ౭ లగాయితు పొట్టుధాన్యములు, మిరియాలు, చెరకు, గోదుమ, శొంఠి, మిరియాలు, బియ్యము ధర తగ్గును.

కార్తీకమాసము:– శు ౫ లగాయితు వరి, నువ్వులు, నూనె, నేయి, బ ౯ లగాయితు చెఱకు, గుడ్డములకు ధర హెచ్చును. శు ౧ లగాయితు ధాన్యము, గోదుమలకు ధర సమము. వస్త్రములు, లోహములు, నూనెజాతులు, నెయ్యి, రస ద్రవ్యములకు ధర సమము. పశువులు, పసుపు, వస్త్రములు, నువ్వులు ధర నిలకడ. బెల్లం, కొబ్బరికాయలు, వేరుశెనగ, చింతపండు, నూనె, నువ్వులు అన్ని మధ్యమము. సుగంధద్రవ్యములు, వేరులు, తీగలు, నార ధర హెచ్చును. శు ౫ లగాయితు లక్క, కర్రలు, స్ఫటికపురాళ్ళు, గుడ్డములు ధర హెచ్చును. శు ౩ లగాయితు బియ్యము యవలు, రత్నములు, వజ్రములు, ధాతువస్త్రములు, నువ్వులు, నూనె, బంగారము, వెండి, ముత్యములు ధర పెరుగును. బ ౧౧ లి॥ పొట్టుధాన్యములు, అడవి పెసలు, ఓషధులు. మిరియాలు, గోదుమ, బియ్యము, కొట్టులు ధర పెరును. శు ౭ లగాయితు బియ్యము, యవలు, వజ్రములు, ధాతువులు, నువ్వులు, నూనెధర హెచ్చును. శు ౧౧ లి॥ పొట్టుధాన్యములు, అడవి పెసలు, మిరియాలు, ఓషధులు ధర పెరుగును. చెఱకు, బెల్లం, చక్కెర, శొంఠి, మిరియాలు, బియ్యం ధర తగ్గును. బ ౯లి॥ బంగారము, వెండి, ఆకులు, సజ్జలు, ఇంగువ ధర హెచ్చును. బ ౧౧ లగాయితు నూనెలు, మిర్చి, మిరియాలు, రసద్రవ్యములు ధరలు తగ్గును.

మార్గశిరమాసము:– శు ౧ లగాయితు ధాన్యాదులకు ధర సమము. శు ౧౯ లగాయితు బెల్లము, చక్కెర ధరసమము. బ ౯ లి॥ చెఱకు, వరి, కాగితములు, నేయి, ఇంగువ, గుడ్డములకు ధర హెచ్చును. పసుపు, ఇంగువ, అల్లం, జాజికాయలు, పోకలు, పగడం ధర హెచ్చును. చింతపండు, ధాన్యము, కూరలు, పెసలు, మినుగులు, నువ్వులు, కొబ్బరి, వేరుశనగ మొదలగువానికి ధర సమము. పసుపు, బెల్లము, గోధుమ ధరలు కొంచెము కలిగియుండును. శు ౧ లి॥ మంజిష్ఠ, చెఱకు, బెల్లము, శొంఠి, చక్కెర, గోధుమ, మిరియాలు, అన్ని, బియ్యము, ధరహెచ్చును. శు ౧౦ లగాయితు బంగారము, నెయ్యి, వెండి, బియ్యము, సజ్జలు, నూనె, ఇంగువ, నువ్వులు ధర పెరుగును, బ ౭ లగాయితు బంగారము, ప్రత్తి, నువ్వులు, పట్టు మొదలగునవి ధరసమము. బ ౪ లగాయితు నూనె, నువ్వులు, ఉప్పు, మిర్చి, మిరియాలు, చందనము, రసద్రవ్యములు, బియ్యం, యవలు, రత్నములు, వజ్రములు, నువ్వులు, పగడములు, నూలు, నెయ్యి, బెల్లం ధర తగ్గును.

పుష్యమాసము :- బ ౬ లగాయితు నువ్వులు, వస్త్రములు, నూలు, దూది, పోకలకు వెల హెచ్చును. బ ౧౦ లగాయితు ధాన్యాదులకు, పసుపు, ఇంగువ, అల్లం, జాజికాయలు, పోకలు, పగడం ధరలు హెచ్చును. బ ౪ లగాయితు నూనెలు, నెయ్యి, పాలు, అన్నం, ఎరుపుబట్టలు, బంగారము, వెండి, రాగి, ఇనుము, కర్పూరము, మంచిగంధము ధర హెచ్చును. మాసమంతయు ధాన్యం, పెసలు, కందులు, మిర్చి. మినుగులు ధర పెరుగును. శు ౭ లగాయితు నూనెలు, నువ్వులు, ఉప్పు, మిర్చి, మిరియాలు, సుగంధద్రవ్యములు, రసద్రవ్యములు, చందనము ధర హెచ్చును. వక్కలు. ఇంగువ, ఖర్జూరం, ఆవాలు ధర పెరుగును. బ ౪ నుండి లక్క, కర్రలు, గుఱ్ఱములు, ఏనుగులు, రాళ్ళు ధర పెరుగును. శు ౨ లగాయితు చెఱకు, బెల్లం, శనగ, ధాన్యం ధర తగ్గును.

మాఘమాసము :- శు ౧౩ లగాయితు బెల్లము, అవిసె, ధాన్యము, శనగలు ధర హెచ్చును. మాసమంతయు నూనె, నెయ్యి. పాలు, అన్నము, ఎరుపుబట్టలు, బంగారము, వెండి, రాగి, ఇనుము, కర్పూరము, మంచిగంధము, ధాన్యం, కందులు, బెల్లం, పసుపు, వజ్రములు. నెయ్యి, మిర్చి, ఆవాలు, నువ్వులు. కొబ్బరి, కూరలకు ధర పెరుగును. శు ౭ నుండి చందనము, కస్తూరి, కర్పూరము, దేవదారు, అగరు, రక్తచందనం, కంద గడ్డలు ధర పెరుగును. బ ౧ లగాయితు యవలు, సన్న బియ్యము, గోధుమ, పెసలు, నల్లరాళ్ళు, చిరుశనగలు ధాన్యం, అడవిపెసలు, మిరియాలు, కొఱ్ఱలు ధర పెరుగును. శు ౧౧ నుండి సర్వధాన్యములు, కంబళ్ళు, వస్త్రములు, ఓషధలు ధరలు పెరుగును, శు ౧౩ లగాయితు బియ్యము, యవలు. వజ్రములు ధాతువులు, నువ్వులు, నూనె ధరలు హెచ్చును. బ ౭ లగాయితు చెరకు, చక్కెర, బెల్లం, గోధుమ, శొంఠి, మిరియాలు ధరలు తగ్గును.

ఫాల్గుణమాసము :- శు ౧ లగాయితు చందనము, కర్పూరము, దేవదారు, కలప, అగరు, రక్తచందనము, దుంపలు. వ్రేళ్ళు ధర హెచ్చును. శు ౧౪ లగాయితు పొట్టు ధాన్యములకు, బ ౭ లగాయితు కుంకుమాలకు ధరలుహెచ్చును, ఎరపు బట్టలు, బంగారం, వెండి, రాగి, ఇనుము, కర్పూరం, మంచిగంధము, రసద్రవ్యములు, వక్కలు, మిరియాలు, ఆవాలు, నూనెపదార్థములు, ఇంగువ మొ॥ వానికి ధరలు పెరుగును. అపరములు, లోహజాతులకు కాయధాన్యములకు, ధరలుసమము. శు ౧౨ నుండి బంగారము, రత్నములు, పెసలు, మినుములు, గుఱ్ఱములు, పగడములు, కంబళ్ళు, ఆవులు, నువ్వులు, వెండి మొ॥లగు వానికి ధరలు పెరుగును. బ ౧౧ లగాయితు చందనము కర్పూరము దేవదారు, అగరు, కస్తూరి, రక్తచందనము, కంద మొదలగువానికి ధరలుపెరుగును బ ౭ లగాయితు చందనము కర్పూరము, దేవదారు, కలప, అగరు, దుంప, పప్పుదినుసులు మొ॥లగువానికి ధరలు తగ్గును.

# 3. రక్తాక్షినామ సంవత్సరం గోచార ఫలములు

## మే ష రా శి

( అశ్విని, భరణి, కృత్తిక 1 )

ఆదాయము: 14: వ్యయం: 2 రాజ పూ: 4: అవ: 5

ఈ సంవత్సరమున ఈ రాశివార్కి జనవరి 12 వరకూ గురుడు 9 ట తామ్ర మూర్తి తదాది 10 ట రజితమూర్తి. డిశం 21 వరకూ శని 7 ట సువర్ణమూర్తి తదాది 8 ట లోహమూర్తి. జనవరి 28 వరకూ రాహువు 2 ట కేతువు 8 ట సువర్ణమూర్తి. తదాది రాహువు జన్మమందును, కేతువు సప్తమందును. రజితమూర్తి.

జన 10 వరకూ భాగ్యమందలి గురుడు శుభప్రదుడు. భాగ్యయోగమును కలుగచేయుటయేకాక శుభకార్యరీత్యా వ్యయము, భూగృహాదిమార్పులూ, స్థానచలనాది, ప్రమోషనులు మొదలగు ఫలితములు కలుగచేయును. తదుపరి కుటుంబ, ఋణచికాకులుకలుగచేయును. డిశం 21 వరకూ శని అనుకూలుడు తదుపరి ప్రతిబంధకములు, కష్ట నష్టములు కలుగచేయును. రాహుకేతువులు సామాన్యులు.

తగిన ఆదాయములు వచ్చుచున్ననూ కళత్ర అనారోగ్యములు, జ్యేష్ఠమాస ప్రాంతమున కలహములు తదుపరి ధనచికాకులు, తదుపరి మాసము అనగా అగష్టు సెప్టెంబరు నెలలందు ధనయోగము వాహనయోగములు కల్గుచున్ననూ. సెప్టెంబరు ప్రాంతమందు కళత్ర అనారోగ్యనివారణలు కల్గుట, తదుపరి శుభకార్యాది ప్రయత్నము సఫలీకృతము అగుట మొదలగు ఫలితములు కల్గును.

డబ్బుకు ఆటంకము రాదు. మాటపలుకుబడి, గౌరవలాభములుకొరకు మాటపట్టింపులు, పంతమునకు పోవుటకూడదు. భూగృహాది మార్పులు జనవరి ప్రాంతమున కలిసి వచ్చును. యంత్రము సంబంధ (ఇనుము) వర్తకులు, కలప, మిల్లర్లు, పేపరు వర్తకులు జాగ్రత్తగామసలుకొనవలయును.

బొగ్గు, రసాయనిక వస్తువులు, ఫ్యాన్సీ, అపరములు, మిర్చి, చింతపండు వగైరా వర్తకులకు జనవరి వరకూ యోగదాయకమయిన కాలము. విద్యార్థులకు సెప్టెంబరుకంటె మార్చి ఛాన్సు చాలా అనుకూలము తగిన శ్రద్ధతీసుకొనవలయును, ఉద్యోగస్థులు, ఉపాధ్యాయులు, డాక్టర్లు, న్యాయవాదులకు ఈ సం॥ర పూర్వార్థము యోగదాయకమయినది. ఇతర ప్రైవేటు రంగములందు పనిచేయు ఉద్యోగులకు అనుకూలమయిన కాలము.

జాయింటు వ్యాపారములు అనుకూలములు. వ్యవసాయదారులకు మొదటి పంటచాలా అనుకూలము. రాజకీయవృత్తులవారు చాలాజాగ్రత్తగా మసలు కొనవలయును. అందులాభములుకలుగవు.

ఈ రాశివార్కి ఆది మంగళ గురు శుక్ర వారములు యోగప్రదమయినవి. వీరికి 2 సంఖ్య యోగప్రదమయినది. 1, 2, 3. 6, 9 తేదీలు సంఖ్యలు అనుకూలము. ఎరుపురంగు ధరించుట వలననూ, శివ నామస్తోత్రపారాయణ అభిషేకములు చేయించుటవలన శుభ ఫలితములుకల్గును,

గోమేధికమురాయి ఉంగరములో ధరించుటవలననూ, జనవరినుండి శనివార నియమములుండుట వలననూ, గురురాహుకేతువులకు గ్రహజపములుచేయించు కొనుటవలననూ, వివాహాదిశుభ కార్యములు కలసివచ్చి, భూగృహాది మార్పులుకల్గి, ఆరోగ్యముకల్గి వుందురు. మనోత్సాహము, ధైర్యము మొద లగు శుభ ఫలితములుకల్గును.

## వృ ష భ రా శి

( కృత్తి 2, 3, 4, రోహిణి, మృగ 1, 2 )

ఆదాయము: 8: వ్యయము: 11: రాజ పూ: 7: అవ: 5

ఈ రాశివార్కి జనవరి 10 వరకు 8 ట రజితమూర్తి, తదాది 9 ట లోహమూర్తి, డిశం 21 వరకు శని 6 ట లోహమూర్తి. తదాది 7 ట తామ్రమూర్తి జన 29 వరకు రాహువు జన్మమందు కేతువు 7 ట లోహమూర్తి తదాది రాహువు 12 ట కేతువు 6 ట లోహ మూర్తి జనవరి 10 నుండి గురుడు అను కూలుడు డిశంబరు వరకు శని శుభప్రదుడు రాహుకేతువులు జనవరివరకూ అనుకూలురు.

మే 20 నుండి శుక్రుడు జూన్ 20 నుండి బుదుడు శుభప్రదులు అగస్టు తదుపరి ఈ రాశివారిలో ప్రభుత్వోద్యోగులకు ధనవాహనాలంకారాది యోగములు ప్రమోషన్లులభించును. పసుపు కుంకుమ, ధాన్యము, వర్తకులకు శాస్త్రవేత్తలకు నవం, డిశం, జనవరి మరియు మే నెలలు కాకమిగిలిన మాసములు శుభయోగములు. మిర్చి పుగాకు బెల్లము వర్తకులకు అక్టోబరు, నవం, ఫిబ్రవరి నెలలు యోగప్రదములుకావు. వైద్య, సినీ,అపరములు, పేపరు మొదలగువర్తకులకు, న్యాయవాదులకు సెప్టె, అక్టో, నవం మాసములు యోగములుకావు. యంత్ర, మిల్లర్లు, ప్యాన్సీ, ఎరువులవర్తకులకు డిశంబరు 21 వరకూ యోగ్యప్రద మయినకాలము, ఈ వర్తకమండలివార్కి సినీ, ధాన్యయంత్ర నిర్మాణారంభముకలుగుటయేకాక, కళత్ర అనారోగ్యములు కల్గి, తదుపరి సామాన్యముగా వుండును.

మొత్తము మీద ఈరాశివార్కి కొంతయోగదాయకమయిన సమయము. జాయింటువ్యాపారులకు అనుకూలము మాటపౌరుషములు, బంగారు, తొట్రుపాటు మానసిక శ్రమ కల్గియుందురు. ఈ సంవత్సర ఉత్తరార్ధమున తరచు ఋణములు, తీర్థయాత్రలు, చేయవలసివచ్చును. కాని ఋణములు విహారణయగును.

వీరికి కీర్తి గౌరవములు అకస్మాత్తుగ కల్గుచుండును. మంచికివెడితేచెడు, కలహములు ఎదురగు చుండును. శిల్పులకు, కళారాధకులకు. ఎలక్ట్రికల్, నాటకవృత్తులవార్కి యోగకాలము. శుభకార్యములు అవ్యవధిగా సమర్థించుదురు. వీరికి హృదయదౌర్బల్యము ఎక్కువగాఉండును. డిశంబరు, తరువాత కళత్ర అనారోగ్యము అగౌరవము, కార్యవిలంబనము మొదలగు ఫలితములు కల్గుచుండును.

విద్యార్థులకు ఫలితముసామాన్యముగనే కన్పట్టుచున్నది, శనిస్తోత్రములుచేయుట వలననూ, వజ్రముఉంగరమునందు ధరించుటవలననూ, అత్యధిక శ్రమవలననూ విద్యాయోగముకల్గును. రాజకీయ దారులకు జయప్రదమైన కాలముకాదు. శి సంఖ్యాబలముఎక్కువ.

౩. ౫, ౯, ౬, ౮ తేదీలు, ఆది, బుధ, శుక్ర శనివారములతో కలసివచ్చిన మరింత యోగప్రదములు. వజ్రముధరించుటవలననూ, గురువార, శనివార నియమము ఉండుటవలననూ వానికి. రాహుకేతువులకు జపములు చేయించుకొనుట వలననూ, కీర్తి తేజస్సు, ధాన్యసంపత్తులు సంసారసుఖములు కల్గును.

సుబ్రహ్మణ్య, విష్ణుపూజలు చేయుట వలనను చిత్రవస్త్రములు, మినుములు దానము ఇచ్చుట వలనను శరీర నీరసము, చర్మవ్యాధులుతగ్గుటయు ప్రమోషనులుకల్గి సుఖసంపత్తులనొందెదరు.

## మి థు న రా శి

(మృగ ౩,౪ ఆర్ద్ర పున 1,2,3)

ఆదాయము : 11: వ్యయం : 8 రాజ పూ : 3: అవ : 1

వీరికి జన 10 వరకు గురుడు 7 ట సువర్ణమూర్తి తదాది 8 ట లోహమూర్తి. డిశం 21 వరకు శని ౫ ట సువర్ణమూర్తి. తదాది 6 ట సువర్ణమూర్తి. రాహువు 12 ట కేతువు 6 ట జన 28 వరకూ సువర్ణమూర్తి. తదాది రాహువు 11 ట కేతువు ౫ ట తామ్రమూర్తి.

ఈ రాశివారికి గురుడు జన 12 వరకు శుభుడు శనిరాహు కేతువులు శుభులు. ధనయోగము సెప్టెం, అక్టో, డిశం మాసములు మే మాసములందు చికాకులు కల్గించును. అపరములు, పసుపు, కుంకుమ, పేపరు, జ్యోతిష, ఇంజనీరింగు సంబంధములవారికి ఈ సంవత్సరమత్యంత యోగదాయకమయినది కాదు. మిల్లర్లకు, సినీనిర్మాణదారులకు, ఇనుము, ఫ్యాన్సీ, వైద్య వృత్తులవారికి డిశంబరువరకూ యోగకాలము.

ఉద్యోగస్థులకు ఉపాధ్యాయులకు, నవం, డిశం, ఫిబ్రవరి తదుపరి ప్రాంతములందు స్థాన చలనములు, చికాకులు, తీర్థయాత్రాశక్తి, ఆందోళనలు, అస్థిమితము మొదలగు ఫలితములు కల్గిననూ మిగిలిన సమయములందు అభీష్టసిద్ధికల్గి, పెద్దలపరిచయముకల్గి, శుభకార్యములు నెరవేర్చుకొనగల్గుదురు.

మిర్చి, పుగాకు, బెల్లము, వస్త్రములు, నూనె, ధాన్యము వగైరావర్తకమండలి వారికి డిశం, మార్చి, సెప్టెం మాసములు లక్ష్మీయోగప్రదములుకాక మిగిలిన మాసములందు ధనవృద్ధి, వ్యాపారవృద్ధి పునర్వ్యాపార ప్రారంభముచేయుటయు, ఋణచికాకులుతగ్గి ఉత్సాహముతో ముందుకు సాగెదరు.

ప్రైవేటు ప్రభుత్వఉద్యోగులకు, అధికారులకు అక్టోబరు పూర్వమందు ప్రమోషనులు లభించుట సంవత్సరాంతమున నీచయోగముల సూచనలుమాత్రమే కల్గును. గృహవ్యాపార విషయములు సాధించు కొనకల్గుదురు. పెద్దల పరిచయమువలన గౌరవాదరణములు కల్గును అందరినీ అన్నివిధములా నమ్మరాదు. కంట్రాక్టుదారులకు జనవరి వరకూ యోగప్రదము. జాయింటువ్యాపారములు కూడ కలసివచ్చును.

రాజకీయాది అన్నివిషయములలో తలదూర్చుట మంచిదికాదు. చిరకాలమునుండి స్థంభించిన కార్యములు నెరవేరును. మీవలన ఇతరులకు మేలుచేకూరును. లాటరీ ఛాన్సు అక్టోబరు, మార్చి ప్రాంతములందు మాత్రమే అనుకూలములు.

విద్యార్థులకు సెప్టెంబరుభాస్సు యోగదాయకమయినదే. ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణత నొందెదరు. గృహములందు వివాహాది శుభకార్యముల నెరవేర్చగలరు.

మంగళ, బుధ, శుక్ర, శనివారములు 1,4,5,6,7 తేదీలు సంఖ్యలు అదృష్టప్రదములు. జనవరి తదుపరి గురువార నియమములు, ఆదివారనియమములు చేసుకొనుటవలన, రాహు గురులకు జపములు, శివాభిషేకములు, పూర్ణిమావ్రతములు, దేవస్తోత్రపారాయణలు చేయించుకొనుటవలన సమస్తవిషయముల జయములు కల్గును. స్వప్నాదిపీడలు అనారోగ్యములు తొలగును.

ఉంగరమునందు గోమేధికము. పసుపురత్నములను ధరించుటవలన ధన, వస్త్ర, వాహన, వ్యాపార లాభములు కల్గుటయేగాక, గణితములో నేర్పుకల్గి జ్ఞాపకశక్తి కల్గి వృద్ధినొందెదరు.

## కర్కాటకరాశి

(పున 4. పుష్య. ఆశ్రే)

ఆదాయము : 5: వ్యయం : 8      రాజ పూ : 6: అవ : 1

ఈ రాశివారికి గురుడు జన 10 వరకు 6 ట లోహమూర్తి. తదాది 7 ట రజితమూర్తి. శని డిశం 21 వరకు 4 ట తామ్రమూర్తి. తదాది 5 ట రజితమూర్తి. జన 29 వరకు రాహువు 11 ట కేతువు 5 ట తామ్రమూర్తి. తదాది రాహువు 10 ట కేతువు 4 ట రజితమూర్తి.

వీరికి జన 10 వరకు మిశ్రమఫలితముల నిచ్చును. తదుపరి సామాన్యుడు. డిశం 21 వరకు శని అర్ధాష్టమమునందు కష్టనష్టములను కలుగచేయుచు మనోచికాకులు కలుగచేయును. జనవరి 29 వరకు రాహువు కేతువు యోగకారకులు. తదుపరి అశుభులు.

సెప్టెం, అక్టో, డిశం, ఫిబ్రి, జూన్ మాసములు యోగకరములుకావు. అధికారులకు సెప్టెం, నవం, జన, జూన్ మాసములు మంచివికావు.

మిల్లర్లు, ఇనుముపనివారలకు, సినీనిర్మాణదారులకు డిశం 21 వరకు యోగప్రదమయిన సమయముకాదు. బెల్లము మిర్చి, పుగాకు, ధాన్యము, అపరములు మొదలగు వర్తకమందలి వారికి సంవత్సరాది నుండి జూన్‌మాస పర్యంతము యోగకరఫలితము లుండుటయు తదుపరి జన 10 వరకు విశేషలాభములు కనబడి, తదుపరి సంవత్సరాంతమున మిశ్రమఫలితముల నొందెదరు.

పసుపు, ధనియాలు, కొబ్బరి, కూరగాయలవర్తకులకు డిశం, జన, మార్చి మాసములు వ్యతిరేకమయినవి. వైద్య, న్యాయశాస్త్ర, ఇంజనీర్లు, మొదలగు వారికి సెప్టెం, నవం, జన, జూన్ మాసములు మంచివికావు.

ఆదాయమునకు మించిన ఖర్చులు కల్గుచుండును. ఎంతతెలివిగలవారయిననూ, ఉద్యోగస్థులు అధికారుల జాగ్రత్తగా మసలుకొనుట మంచిది. గౌరవపటుకుబడికి సంఘపలుకుబడికి లోపముండదు. రాహు

బలము ఉన్నంతకాలము శుభప్రదముగనుండును. కళత్ర అనారోగ్య, ఋణ చికాకులందు ఓర్పు అవసరము. శ్రమమీద లావాదేవీలు అనుకూలించును. జనవరినుంచి కొంత అనుకూలత కనుపించును. మాటనేర్పు కొంత అనుకూలించును.

చాలామందికి వివాహాది శుభకార్యములు, భూగృహాదిమార్పులు అక్టో, నవం, డిశం, జనవరి మాసములందనుకూలించును. వ్యాపారస్తులకు పైచెప్పబడిన మాసములుకాక ఇతర మాసములందు వ్యాపారాభివృద్ధి, ధనాభివృద్ధి, గౌరవమర్యాదలు అభివృద్ధిగ నుండును. ఉపధ్యాయేతర వృత్తులవారికి అనుకూలమయిన కాలము. ఇతరులవలన ఉపకారము లాభముకలుగును.

విద్యార్థులకు గతంలోకన్న ఎక్కువ శ్రద్ధ అవసరము 2,6,7,9 తేదీలు ఆది, సోమ, మంగళ, శుక్రవారములతో వచ్చిన మరింత శుభప్రదములు.

ఉంగరమునందు ముత్యము, నీలముధరించుటవలనను. గురు, శనిరాహువులకు జపము చేయించుకొనుటవలనను. శివస్తోత్రము జరుపుటవలనను కార్యసిద్ధి, మనోత్సాహము, యత్నకార్యసిద్ధి, సంతాన సౌఖ్యము, సౌభాగ్యవృద్ధి కలుగును.

## సింహరాశి

(మఘ. పూ-ఫ. ఉ-ఫ 1)

**ఆదాయం : 8; వ్యయం : 2** **రాజపూ : 2; అవ : 4**

వీరికి జన 10 వరకూ 5 ట గురుడు, తదాది 6 ట సువర్ణమూర్తి, డిశం 21 వరకు శని 3 ట రజితమూర్తి. తదాది 4 ట లోహమూర్తి. జన 29 వరకూ రాహువు 10 ట కేతువు 4 ట రజతమూర్తి. తదాది రాహువు 9 ట కేతువు 3 ట సువర్ణమూర్తి. జనవరివరకూ గురుడు శుభప్రదుడు. తదుపరి కొంత అనుకూలుడు. డిశం 21 వరకు శని శుభప్రదుడు, తరువాత అర్ధాష్టముడౌటవలన ఋణచికాకులు, మనో అస్థిమితము, కార్యవిలంబనము. ప్రతిపనియందు శ్రమ కలుగచేయుచుండును. రాహుకేతువులు శుభప్రదులు.

జూలై, నవం, ఫిబ్రవరి మాసములు సాధారణముగా ఈ రాశివారలకు అనుకూలమైనవి కావు. పేపరు, మిర్చి, చింతపండు, బెల్లము, అపరములు మొదలగు వర్తకులు వైద్య, న్యాయవాద, యాక్టర్లకు ఈ సం॥రము చాలా అనుకూలమయిన కాలము. వీరికి సెప్టెం, అక్టో ప్రారంభమునందు, ఫిబ్రవరిమాసములు యోగప్రదములు కావు.

ఇనుము వర్తకులు, నూనెవర్తకులు, మిల్లర్లు, ఇంజనీర్లు మొదలగువారికి సినిమావ్యాపారులకు డిశంబరువరకు ఎక్కువ యోగకాలము. తదుపరివారికి పెద్దపెట్టుబడుల పెట్టవలసివచ్చును. ఉద్యోగులకు అక్టో, నవం, డిశం, జనవరి మాసములయందు ఆశించిన ఫలితములు నెరవేరును. తదుపరి సంవత్సరాంతమునకు చికాకులు, స్థానచలనములు కల్గిననూ నివృత్తి పొందెదరు.

వ్యవసాయదారులకు రెండవపంటకన్న మొదటిపంటయందు అధికలాభములు కలసివచ్చును. మొత్తముమీద ఈ రాశివారికి ప్రతిపనియందును కొంత అలస్యము, శ్రమ కనుపించిననూ అనుకూలము

కనబడును. భూ గృహాదిమార్పులు అనుకూలించును. ధనము చేతికి అందుచున్ననూ ఆకస్మిక ఖర్చులు ఎదురగుచుండును. తీర్థయాత్రలు అనుకూలించును. రాజకీయప్రవేశంగల వారికి జనవరినుండి ఎక్కువ లాభములు కల్గును.

విద్యార్థులకు అధికశ్రమ అవసరము. వీరు యాత్రాదిపుణ్య దేవకార్యములందు నిమగ్నులై ఉందురు. గౌరవముకొరకు పాటుపడెదరు. 1,2,3,6,7,9 తేదీలు, ఆది, మంగళ, బుధవారములతో కలసి వచ్చిన మరింత యోగప్రదము.

వీరు గురువార నియమముండుట వలనను, శనిగ్రహజపము చేయించుకొనుట వలనను, సూర్య నమస్కారములు చేయుటవలనను నేత్రరోగములు తగ్గి, అపమృత్యుభయము తొలగి వ్యవహారజయము గల్గును. గౌరవాధిక్యత పెరుగును.

## కన్యా రాశి

(ఉ-ఫ 2.3,4, హస్త, చిత్ర 1, 2)

ఆదాయము: 11: వ్యయం: 8 రాజ పూ: 5; అవ: 4

ఈ రాశివారికి జన 10 వరకు 4ట గురుడు తామ్రమూర్తి. తదాది 5 ట లోహమూర్తి డిశం 21 వరకూ శని 2 ట లోహ మూర్తి. తదాది 3 ట తామ్రమూర్తి. రాహువు జన 29 వరకు 9 ట కేతువు 3 ట తదాది రాహువు 8 ట కేతువు 2 ట లోహమూర్తి.

జనవరి నుండి గురుడు శుభుడు. శని అనుకూలుడు. రాహుకేతువులు సామాన్యులు. ఈ రాశి వారిలో మొత్తంమీద నవం, జనవరి నెలలు యోగప్రదములు కావు. అక్టోబరు, ఫిబ్రవరి, జూన్, సెప్టెంబరు నెలలు మహాయోగప్రదము లయినవి.

వైద్య, గణిత సంబంధముల వారికి, పసుపు, అపరములు, పేపరు మొదలగు వర్తకులకు ఈ సంవత్సరము యోగనీయమైన కాలము. బెల్లము, మిర్చి, పుగాకు, చింతపండు మొదలగు వర్తకులకు మార్చినెల కాక ఇతరనెలలు యోగదాయకములు.

ప్లీడర్లు, యాక్టర్లు మొదలగువారికి ఇనుము, కలపవ్యాపారులకు సంవత్సర ఉత్తరార్థభాగము నందు అత్యధికలాభము, భూగృహయోగము, వాహనయోగము కల్గును.

జనవరి లగాయితు కొంత అనుకూలత కల్గిననూ, అష్టమరాహువు కష్టనష్టములు, మానసిక శ్రమ చికాకులు, నరముల బలహీనత, ధనవ్యయము కలుగుచుండును. కుటుంబములోని వారికి అనారోగ్యములు, అకాలభోజనములు కలుగుచుండును. శ్రమకు తగినఫలితము లభించకపోయిననూ కొంతఫలితములే కల్గును ఫిబ్రవరి, జూన్, సెప్టెం, అక్టో, డిశంబరు నెలలు అనుకూలములు.

ఉద్యోగస్థులకు, ప్రైవేటుసంస్థల యజమానులకు సామాన్యఫలితములే కల్గును. అదాయ గౌరవ ప్రతిపత్తులకు లోటుండదు. అధికారలాభముచే ప్రభుత్వచికాకులు తట్టుకొనవలసివచ్చును. భూగృహాది

మార్పులు ఒకమాదిరిగ కలసివచ్చును. తరచు ఆదాయమునకు మించిన ఖర్చులు అవ్యవధిగ వచ్చుచున్నను వాటిని తట్టుకొనగల్గుదురు.

విద్యార్థులకు అనుకూలమయిన ఫలితములు కల్గును. శ్రమ అధికత కావలయును. వ్యాపారులకు మొత్తముమీద ఫలితములు సుమారుగా నుండును. రాహువు, గురుడు, శనిలకు జపము చేయించుకొనుటవలననూ, సూర్యనమస్కారములు జరుపుటవలనను ఆశించిన ఫలితములు లభించును. రాజకీయదారులకు తగినకాలము కాదు.

గోమేధికమురాయి ఉంగరమునందు ధరించుటవలననూ, గౌరీపూజలు చేయించుకొనుటవలనను వివాహాది శుభకార్యములు కలసివచ్చి, వ్యాపారలాభము కల్గి, నరముల బలహీనత తగ్గి, బుద్ధిమాంద్యము తగ్గును. దైవబలముచే ఫలితములు సానుకూలము గావింపబడును.

## తు లా రా శి

(చిత్ర 3, 4, స్వాతి. విశాఖ 1. 2. 3.)

ఆదాయము: 8: వ్యయం: 11 రాజ పూ: 1: అవ: 7

ఈ రాశివారికి గురుడు జనవరి 10 వరకు 3 ట రజితమూర్తి, తదాది 4 ట సువర్ణమూర్తి. డిశం 21 వరకు శని జన్మమందు, తదాది 2 ట, రజితమూర్తి. జన 29 వరకు రాహువు 3 ట కేతువు 2 ట తామ్రమూర్తి. తదాది రాహువు 7 ట కేతువు జన్మమందు సువర్ణమూర్తి.

గురుడు జనవరి 10 నుండి అనుకూలుడు. శని, రాహువు కేతువులు సామాన్యులు. సాధారణముగ ఈ రాశివారికి ఏప్రిల్, అక్టో, నవం, ఫిబ్రవరి మాసములు మంచివి కాని, ఆ యా మాసములందు ధనవ్యయము. అనారోగ్యము, చికాకులు, కార్య విఘ్నము, అపశకునములు మొదలగు చెడుఫలితములు కలుగవచ్చును. జూలై, ఆగ, డిశం, జన, మార్చి నెలలు అత్యంతయోగప్రదములు.

ఈ సం॥రమున అపరములు బెల్లము, పుగాకు, కలప, మిర్చి, కాగితము, మొదలగు వర్తకులకు ప్రభుత్వ అధికారులకు ఎక్కువ యోగదాయకమయిన కాలము, వైద్య, ఇంజనీరింగు, న్యాయవాద డిపార్టుమెంటు వారికి, ఇనుము, తైలము, పసుపు, ధాన్యము మొదలగు వర్తకమండలివారికి సామాన్య ఫలితములు కనబడుచున్నను మే, జూన్, అక్టో, నవం, నెలలందు ప్రభుత్వ వత్తిడి కల్గుచున్ననూ వెంటనే నివృత్తిని పొంద గల్గుదురు. సంవత్సరమున 3 ట 2 వంతులు ఫలితములు పొందుదురు.

రైస్‌మిల్లులు, సినీ అధికారులకు అక్టోబరునుండి యోగకాలముకాదు. సామాన్యముగనేవుండును. జన్మశని, అష్టమ రాహువు కష్టనష్టప్రదులు. తరచు మానసిక శ్రమ, అలసట, వ్యాకులత, కల్గించుచుందురు. అపజయము, వృధావ్యయము, ఋణచికాకులు జరగవచ్చును. కోర్టువ్యవహారములు అనుకూలములు కావు. రాజకీయమునందు తమకంటె తక్కువవారి సహకారము కోరవలసివచ్చును, అపవాదములు, సంసారబాధలు అస్థిమితము చూపవచ్చును. ఫలితము సామాన్యమయిననూ గౌరవప్రతిపత్తులకొరకు పాటుపడెదరు. ఆదాయమునకు మించిన ఖర్చులు ఎదురగుచుండును.

ఉద్యోగులు తగుజాగ్రత్త వహించవలసిన కాలము. మిత్రులు శత్రువులగుదురు. విద్యార్థులకు ఫలితము అనుకూలించును. ఈ రాశివారిలో చాలమందికి పుత్రమూలకముగ అనుకూలము కల్గుచుండును. వ్యవసాయదారులకు ఎక్కువ 2వ పంట యోగించును.

నీలమణిని ఉంగరమునందు ధరించుకొనుట వలనను, శని, గురువార నియమము లుండుటయు, శని, గురు, రాహు కేతువులకు జపములు చేయించుకొనుట వలనను, సుబ్రహ్మణ్య స్తోత్రములు చేయుట వలనను, రుద్రాభిషేకములు చేయించుకొనుట వలనను సర్వకార్యసిద్ధి, మనోత్సాహము కల్గుటయు దుష్ట పీడలూ నివారితమయి సానుకూలముగ నుండగలరు.

3,6,7,8,9 తేదీలు, సంఖ్యలు, ఆది, మంగళ శుక్ర, శనివారములు యోగించును.

## వృశ్చిక రాశి

(విశాఖ 4, అనూ. జ్యేష్ఠ)

ఆదాయము: 14: వ్యయం: 2 రాజ పూ: 4: అవ: 7

ఈ రాశివారికి జనవరి 10 వరకు గురుడు 2 ట లోహమూర్తి, తదాది 3ట తామ్రమూర్తి, డిశం 21 వరకు శని వ్యయమందు, తదాది జన్మమందు సువర్ణమూర్తి. జనవరి 29 వరకు రాహువు 7ట, కేతువు జన్మమందు సువర్ణమూర్తి. తదాది రాహువు 6ట కేతువు వ్యయమందు తామ్రమూర్తి.

ఈ సం॥రము గురుడు శుభప్రదుడు, శని వ్యయమందు కష్టనష్టములు కల్గించును. తరువాత సామాన్యుడు, రాహువు జనవరి వరకు కొంతవరకు అనుకూలుడు. ఈ రాశివారికి జనవరి వరకు యోగ మయిన కాలము. ఏప్రిల్, జూలై, నవం, మార్చినెలలు అనుకూలప్రదమయినవి కావు.

వ్యవసాయదారులకు సామాన్యమయిన కాలము. పసుపు, కాగితము, కలప, నూలు, మొదలగు వర్తకులకు, జ్యోతిష, భూగోళ, నావిక, న్యాయశాస్త్రములు సంబంధిత వృత్తులవారికి జూలై, ఆగ, సెప్టెం, అక్టోబరు, డిశం మాసములు చాలా లాభదాయకములైనవి. ఇందు వ్యాపారాభివృద్ధి, మనోత్సాహము, ధైర్యము, యత్నకార్య సిద్ధి మొ॥గు ఫలితములు కల్గును.

వైద్య, న్యాయవాదవృత్తులవారికి, అపరములు, పుగాకు, మిర్చి, ధాన్యము వగైరా వర్తకులకు జూన్, ఆగ, సెప్టెం, అక్టోబరు నెలలందు విశేషమయిన లాభములు కలిసివచ్చి, నవం, డిశంబరు మాసము లందు ధరల భేదమువలన, ప్రభుత్వ పత్తిడులవలన రవాణా లోపమువలన కొంత ఆటంకము కల్గి, తదుపరి, సామాన్యఫలితములు పొందెదరు.

ఇనుము, చింతపండు, ఫ్యాన్సీ, నూనె, యంత్రపరికరములు వగైరా వర్తకులకు, ఇంజనీర్లు, సినిమాధికారులు, మిల్లర్లు మొదలగు వర్తకమండలివారికి డిశంబరు వరకు లాభములు కలసివచ్చి తదాది మామూలుగ నుందురు. ఈ వర్తకమండలివారు జాగ్రత్తగా మసలుకోవలసిన అవసరం కలదు.

నిలువదారులు జాగ్రత్త వహించుట మంచిది, అతినెమ్మదిమీద పనులు సాధించుకొనగల్గుదురు. గౌరవము, మాట పలుకుబడి, విదేశపర్యటన, ధనవ్యయము సమానముగ నడుచును. అకస్మిక ఆదాయ, వ్యయములు కల్గుచుండును. ఆత్మీయులతో కలతలు తట్టుకొనవలసి యుండును. లాటరీఛాన్సు లేదు. కోర్టు వ్యవహారములు, రాజకీయములు అనుకూలములు కావు. తమబాధ్యతలు ఇతరులపై నుంచుట మంచిది కాదు.

విద్యార్థులకు ఫలితములు సామాన్యము. ఎక్కువశ్రద్ధ, పరిశ్రమ పట్టుదల అవసరము. కుటుంబ సభ్యులకు ఆరోగ్యము సామాన్యము. ఉంగరమునంగు వైడూర్యము ధరించుటవలననూ, దుర్గాస్తోత్రములు శనికేతు గ్రహజపములు చేయించుకొనుట వలననూ, సుబ్రహ్మణ్యపూజలు చేసుకొనుట వలననూ యత్న కార్యసిద్ధి, కార్య, వ్యాపారసానుకూలత మొదలగు ఫలితములు కల్గును.

ఆది, మంగళ, బుధ, గురువారములు. 2,4,5,6,9 తేదీలు యోగప్రదములు. శనివార నియమము వుండుట అత్యంతయోగదాయకము. దీనివలన ధనసంపాదనకల్గియు, చికాకులు, కలతలుకల్గి, దీర్ఘవ్యాధులు నశించి వ్యాపారాభివృద్ధి భూ-గృహయోగము కల్గును.

## ధనూ రాశి

(మూల. పూ-షా. ఉ-షా,)

ఆదాయము: 2; వ్యయం: 11 రాజపూ: 7; అవ: 7

ఈ రాశివారికి గురుడు జనవరి 10 వరకు జన్మమందు తామమూర్తి తదాది 2 ట రజితమూర్తి. శని డిశం 21 వరకు 11 ట రజితమూర్తి తదాది వ్యయమందు లోహమూర్తి జనవరి 29 వరకు రాహువు 6 ట కేతువు 12ట, తదాది రాహువు 5 ట, కేతువు 11 ట రజితమూర్తి.

జనవరివరకు శని రాహువులు శుభప్రదులు. గురుడు తదుపరి శుభుడు, ఈ రాశివారికీ సం॥రము జనవరివరకు అత్యంతలాభమైన కాలము. జనవరివరకు జన్మ గురుడు చికాకులు, మనస్పర్థలు, అశాంతి, వ్యయము, మొదలగు ఫలితములు సూచించును, వ్యాపారస్తులు యత్రాంగ అధికారులకు జనవరి వరకూ యోగప్రదముగనుండి అక్టోబరు జనవరి ప్రాంతములందు పునర్యంత్ర నిర్మాణారంభముచేయుట వృత్తి అభివృద్ధి అగుట మొదలగు ఫలితముల నొందెదరు.

వైద్య, గణిత, ఇంజనీరింగు, జ్యోతిషవృత్తుల వారికి కలప, పేపరు, ఫ్యాన్సీ, కూరగాయల వర్తకులకు, న్యాయవాదులకు, డాక్టర్లకు అపరములవర్తకులకు జూన్ జూలై, నవం డిశం, మాసములందు సామాన్యఫలితములు కల్గి డిశంబరు ప్రాంతమునుండి సామాన్యఫలితములు మాత్రమే ఉంటాయి.

యంత్ర, నూనె, బట్టలు, చింతపండు, మిర్చి వర్తకులకు మార్చి, ఏప్రిల్, అగ, సెప్టెం, అక్టో, నవంబరు మాసములందు ఫలితములు విస్తారముగ నుండును. జనవరినుండి శని అధికవ్యయము కల్గించును. జనవరినుండి ఆదాయమునకు మించిన ఖర్చులుకల్గును. బంధు మిత్రుల సహకారమువలన శుభకార్యములు నెరవేరును, నిల్వదారులకు ఫలితము జనవరివరకూకల్గును. ఉద్యోగమందలివారికి సంవత్సర పూర్వార్ధము కన్న ఉత్తరార్థము అనుకూలము.

రాజకీయదారులకు జనవరి తరువాత యోగసమయముకాదు. విద్యార్థులకు ఫలితము అనుకూలము ఔషధ, అలంకారములకు వృధావ్యయము తప్పదు. రైతులకు మొదటిపంట, మెరకసస్యములు ఫలించును.

ఆది, శుక్ర, గురువారములు 1,3,5,6,7 తేదీలు, సంఖ్యలు శుభప్రదమయినవి.

## మకరరాశి

(ఉ-షా 2.3.4, శ్రవ ధని 1.2)

ఆదాయము: 5: వ్యయం: 5 రాజ పూ: 3: అవ: 3

ఈ రాశివారికి గురుడు జనవరి 10 వరకు వ్యయమందు సువర్ణమూర్తి, తదాది జన్మమందు లోహమూర్తి శని డిశం 21 వరకు 10ట లోహమూర్తి తదాదిలాభమందు సువర్ణమూర్తి జనవరి 29 వరకు రాహువు 6 ట కేతువు 11ట లోహమూర్తి తదాది రాహువు 4 ట కేతువు 10 ట లోహమూర్తి.

జనవరి వరకు గురుడు సామాన్యుడు. శని సంవత్సరమంతయు శుభప్రదుడే. జనవరి నుండి రాహుకేతువులు సామాన్యులు, సాధారణముగా ఈ రాశివారికి 4,9,11, మాసములు యోగప్రదమయినవి కావు. ప్రతిపనియందు శ్రమ, అలస్యము, కార్యప్రతిబంధకములు, ఋణచికాకులు కల్గుచుండును. 2,6,7,8.10 మాసములు విశేష యోగములు కలుగచేయును.

పేపరు, అపరముల వారికి, మిర్చి, పుగాకు, ధాన్య ,బెల్లం, కలప, వగైరా వర్తక మండలి వారికి ఏప్రిల్ నెల చికాకులు కల్గిననూ సంవత్సరమంతయు విశేషలాభముల నొందుదురు.

వైద్య, న్యాయవాద, యాక్టరు మొదలగు వృత్తులవారికి కళారసజ్ఞులకు జూన్, అగ, నవం, జనవరి మాసములు అయత్న కార్యసిద్ధి, అస్థిమితము, అయత్నగౌరవములు మొదలగు ఫలితములు కలుగును.

ప్యాన్సీ, ఇనుము, చింతపండు, నూనె, బట్టలు, వర్తకులకు, సినీ అధికారులకు, మిల్లర్లకు సాధారణముగా పైన చెప్పబడిన మాసములు సామాన్య ఫలితములు కల్గిననూ సంవత్సరమున తలవని తలంపుగ లాభములు, నిర్మాణయోగములు కలసివచ్చును.

ఇంకనూ ఈ రాశివారికి తగుమార్పులు, ధనవ్యయము, కల్గు సూచనలు ఏర్పడును. ప్రయత్నము లందు శ్రద్ధచూపవలెను, పస్తువాహన, శుభ కార్యదులకు ఖర్చులు కల్గును.

కంట్రాక్టు యంత్రపనివారలకు చికాకులు. కోర్టువ్యవహారములు తొలగును. ఇతరులపై ఆధార పడుట మంచిదికాదు. ఉద్యోగస్థులకు అక్టో, నవం, డిశం, జనవరిమాసములలో ప్రమోషనులు, యత్నకార్య సిద్ధికల్గును. వ్యవసాయదారులకు మొదటిపంట విశేషముగయోగించి రెండవపంట సామాన్యముగఫలించును 2,3,5,7,9 తేదీలు, సంఖ్యలు మరియు సోమ, మంగళ, శుక్ర, శనివారములు మరింత శుభప్రదములు.

విద్యార్థులకు మంచిసమయము, ఫలితములు అనుకూలములు, స్నేహితులయొక్క సహాయము లభించును. వైడూర్యము ధరించుటవలనను. గురు, రాహువులకు గ్రహజపము చేయించుటవలననూ. గురువారనియమములు చేయుటవలననూ, మనోవాంఛలు నెరవేరును. సుబ్రహ్మణ్య, దుర్గాపూజలు చేయుటవలన ఆరోగ్యము, గౌరవము. ఇష్టకార్యసిద్ధి, మానసికచికాకులు తొలగిపోవును. రాజకీయము యోగించును.

## కుంభరాశి

(ధని. 1.2, శత, పూభా 1,2.3)

ఆదాయం : 5: వ్యయం : 5 రాజ పూ : 6: అవ. : 3

ఈ రాశివారికి గురుడు జన 10 వరకు లాభమందు రజితమూర్తి. తదాది వ్యయమందు తామ్రమూర్తి. శని డిశం 21 వరకు 9 ట, తదుపరి 10 ట తామ్రమూర్తి. జన 29 వరకు 4 ట రాహువు, 10 ట కేతువు, తదుపరి రాహువు 3 ట కేతువు 9 ట తామ్రమూర్తి.

జన 10 వరకు గురుడు లాభమందు శుభప్రదుడు అనుకూలుడు. తదుపరి ప్రతిబంధకములు కలుగచేయును. సంవత్సరమంతయు శని అనుకూలుడే. జనవరినుండి రాహుకేతువులు యోగవంతులు. సాధారణముగా వీరికి 4,7,9,12 మాసములు మంచివి కావు.

న్యాయవాదులు, కళాకారులకు, నావిక, శాస్త్రవేత్తలకు సామాన్యమయిన కాలము అపరములు, బెల్లము, పేపరు, చింతపండు, మిర్చి, పుగాకు, కలప మొదలగువర్తకులకు 4,7,11,12 మాసములు మంచివి కావు, జనవరివరకు ఇతరమాసములు యోగప్రదములు.

బట్టలు, నూనె, ఇనుము, రసాయన, అలంకారపరికరములు వగైరావర్తకులు, మిల్లర్లు మొదలగు వారికి అక్టోబరువరకూ విశేషయోగములుకల్గి, తదుపరి ప్రాంతములందు భూగృహమార్పులు, వాంఛా మార్పులు అనుకూలించిన సంవత్సరాంతమున సామాన్యలాభములు పొందెదరు. వీరికి జనవరివరకు యోగ కాలము. ప్రతిపనియు స్వశక్తితో చేసుకొనకల్గుదురు.

గౌరవమర్యాదలు లభించును. రాజకీయములందు యోగకరమయినసమయము. ఉద్యోగస్తులకు అనుకూలమార్పులుకల్గును. ప్రయాణవత్తిడిలు ఎక్కువగును. అనారోగ్యసూచనలు కల్గిననూ బాధించవు. అధికారలాభము, కార్యసాఫల్యత, స్వస్థత, ప్రారంభించినపనులు నెరవేరును. వ్యవసాయదారులకు యోగ కాలము.

శుభకార్యాదులు, తీర్థయాత్రాదులు తలవని తలంపుగ నెరవేరును. దైవచింత ఎక్కువగును. విద్యార్థులకు మార్పిచాన్సు యోగించును. శనిస్తోత్రపారాయణ, రాహుకేతువులకు జపము, సుబ్రహ్మణ్యా పూజలు అభిషేకములు జరిపించినచో మానసికవికాసము, మనోధైర్యము, యత్నకార్యసిద్ధి కల్గును.

నీలమణి ధరించుట వలనను, ఋణచికాకులుతగ్గి ధనవృద్ధి కల్గును. 3,5,7,9 తేదీలు, సంఖ్యలు, ఆది, మంగళ, గురు, శుక్రవారములు యోగప్రదములు.

# మీ న రా శి

( పూభా 4, ఉభా, రేవ. )

ఆదాయము : 2: వ్యయము : 11 రాజ పూ : 2: అవ : 6

గురుడు ఈ రాశివారికి జనవరి 10 వరకు 10 ట లోహమూర్తి. తదాది 11 ట సువర్ణమూర్తి. డిశంబరు 21 వరకు శని 8 ట రజితమూర్తి. తదాది 9 ట రజితమూర్తి. జనవరి 29 వరకు రాహువు 3 ట కేతువు 9 ట రజితమూర్తి. తదుపరి రాహువు 2 ట కేతువు 8 ట సువర్ణమూర్తి.

జనవరి 10 వరకు గురుడు అనుకూలప్రదుడు. తదుపరి సంవత్సరాంతమువరకూ మిశ్రమ యోగములిచ్చును. డిశంబరు వరకు శని అష్టమందు కష్టనష్ట, ప్రతిబంధకములు కలుగచేయును. తదుపరి భాగ్యమందలి శని లాభప్రదుడు. భూగృహాది మార్పులు కలుగచేయును. జనవరి వరకు రాహుకేతువులు మంచిఫలితము లిచ్చెదరు.

ఈ రాశివారికి ఈ సంవత్సరమంతయు శుభా శుభ మిశ్రమముగనుండును, 3,9,10, మరియు జనవరిమాసములు ఈ రాశివారికి అనుకూలములు కావు. సుమారుగ అన్నివర్గముల వారికి జనవరినుండి మనోత్సాహము యత్నకార్యసిద్ధి మొదలగు ఫలితములు కల్గును.

యంత్రపరికరములు. నూనె, ఫ్యాన్సీ, చింతపండు, నూలు, వగైరావర్తకులకు కంట్రాక్టు దారులకు 1,3,4,6,7,9,11,12 మాసములు అనుకూలముగ మాత్రమే వుండును.

అపరములు, కలప, పేపరు. మొదలగు వర్తకులకు ఉద్యోగులకు గణిత, సైన్సు, రాజకీయ, న్యాయవాద, సినీవృత్తుల వారికి 3,4,6,7,9, మాసములుకాక, అక్టోబరువరకు సామాన్యఫలితములు కల్గును.

ఈ రాశివారికి అదాయమునకు మించినఖర్చు ఎక్కువగనుండును. సకాలమునకు ధనము అందక, వత్తిడికల్గుటయు ఆకస్మికధన లాభముకల్గిననూ వ్యయమగుటయు. పనులు నెరవేర్చుకొనుటయు జరుగును కుటుంబకలతలు కల్గిననూ సమర్థించుకొన గల్గుదురు. కంట్రాక్టుపనులు, వ్యవసాయములు తగ్గించుకొనుట మంచిది, పరస్పరసహకారము, దైవభక్తి, మాట మంచితనము, వీరి అభివృద్ధికి మార్గములు. వ్యవహార ఋణచికాకులు జనవరినుండి తొలగిపోవును.

విద్యార్థులు అత్యంత శ్రమను విద్యపై కేంద్రీకరించవలయును, ఆత్మీయులతో అనుకూలత తక్కువగానుండును. అనారోగ్యసూచనలు కల్గిననూ బాధించవు, ఔషధిసేవ చేయవలసివచ్చును, బంధువులతో మనస్పర్థలు కనబడును తరచు మానసికాందోళన, ధనవ్యయములు కల్గుచుండును. సౌమ్యమువహించుట మాటనేర్పు చాలా అవసరము. వ్యవహారదక్షులు చాలాజాగరూకత వహించవలయును. 1,2,4,6,9, తేదీలు సంఖ్యలు, అది, మంగళ, గురువారములు యోగప్రదములు ఉంగరమునందు ఇంద్రనీలము ధరించుటవలన గురుశనులకు గ్రహజపములు చేయుటవలనను, లక్ష్మి, దుర్గా పూజలువలన సంతాన సౌఖ్యము, మనోల్లాసము ఋణవిముక్తి, ధైర్యము, శతృజయము కల్గియు, బుద్ధిమాంద్యముతొలగి లక్ష్మీవృద్ధికల్గి శుభ ఫలితము పొందెదరు.

# 4. శుభముహూర్తములు

## చైత్రమాసము

1984 ఏప్రెల్ నెల

2 శు ౧ సో॥ రేవతి నూతన వస్త్రాలంకార రాజదర్శనాదులుమిధునము ప. 12–25.

6 శు ౫ శుక్ర॥ రోహిణి ఉపనయన వివాహాదులు మిధునము ప. 12–5

7 శు ౬ శని॥ మృగ ఉపనయన వివాహ గృహారంభాదులు మిధునము ప. 12–2

8 శ. ౭ ఆది॥ ఆర్ద్రి ఋగ్వేదోపనయనము మిధునము ప. 11–59

పునర్వసు గర్భాధానము ధనుస్సు రా. 11–11

11 శు ౧౦ బుధ॥ మఘ వివాహము ధనుస్సునందు రా. 11–8

14 శు ౧౩ శని॥ ఉ-ఫ వివాహ గృహారంభ ప్రవేశాదులు మిధునము ప. 11–36

16 బ ౧ సో॥ స్వాతిగృహారంభ ప్రవేశాదులు మిధునము ప. 11–28

18 బ ౩ బుధ॥ అనూ వివాహ గర్భాధాన గృహప్రవేశములు ధనుస్సు రా. 11–52

20 బ ౫ శుక్ర॥ వివాహాదులు కుంభము రా. 3–36

22 బ ౭ ఆది॥ ఉ-షా ఉపనయన అక్షర స్వీకార వివాహ గృహారంభ ప్రవేశాదులు మిధునము ప. 11–4

25 బ ౧౦ బుధ॥ ధని ఉపనయన వివాహ అక్షర స్వీకార గృహారంభాదులు మిధునము ఉ. 10–52

## వైశాఖమాసము

మే నెల

4 శు ౩ శు॥ మృగ వివాహ గర్భాదానాదులు ధనుస్సు రా. 10–49

9 శు ౮ బుధ॥ మఘా వివాహము ధనుస్సు రా. 10–31

10 శు ౧౦ గురు॥ ఉ-ఫ వివాహాదులు కుంభము రా. 2–24

13 శు ౧౩ ఆది॥ చిత్త అన్నప్రాశనాదులు కర్కా ప. 10–40

18 బ ౩ శుక్ర॥ మూల అన్నప్రాశనము కర్కా ప. 10–19

## జ్యేష్ఠమాసము

జూన్ నెల

10 శు ౧౧ ఆది॥ స్వాతి అన్నప్రాశనము కర్కాటకము ఉ. 8–49

17 బ ౪ ఆది॥ శ్రవ. అన్నప్రాశనము కర్కాటకము ఉ. 8–23

23 బ ౧౦ శని॥ రేవతి అన్నప్రాశనాదులు సింహము ఉ. 11–2

## ఆషాఢమాసము

జూలై నెల

5 శు ౭ గురు॥ అన్నప్రాశనము కన్య ఉ. 11–49

9 ౧౧ సో॥ అనూ అన్నప్రాశనము సింహము ఉ. 10–3

## శ్రావణమాసము

అగస్టు నెల

1 శు ౪ బుధ॥ అన్నప్రాశన వివాహాదులు సింహము ఉ. 8–31

3 శు ౭ శు॥ స్వాతి వివాహ గర్భాధానాదులు కుంభం రా. 8–45

వివాహ గృహారంభాదులు మిధునము రా. 4–19

6 శు ౧౦ సో॥ అనూ గృహారంభాదులు సింహము ఉ. 8–11

9 శు ౧౩ గురు॥ ఉ-షా. గృహప్రవేశ గర్భాధానములు కుంభం. రా. 8–20

12 బ ౧ ఆది॥ ధని వివాహ గృహారంభాదులు సింహము ఉ. 7–46

గృహప్రవేశ, గర్భాధానాదులు కుంభము రా. 8–4

15 బ ౪ బు॥ ఉ-భా. వివాహ గర్భాధాన నవగృహ ప్రవేశాదులు కుంభము రా. 7-53
రేవతి వివాహగృహారంభ ప్రవేశాదులు మిధునము రాత్రి 3-29

16 బ ౫ గురు॥ రేవతి వివాహ గృహారంభ ప్రవేశాదులు మిధునం తె. 3-26

## భాద్రపదమాసము

### సెప్టెంబరు నెల

9 శు ౧౪ ఆది॥ శత అన్నప్రాసనాదులు కన్య. ఉ. 7-34

## ఆశ్వయుజమాసము

### అక్టోబరు నెల

3 శు ౯ బుధ॥ ఉ-షా వివాహాదులు కర్కా రా. 1-16

4 శు ౧౦ గురు॥ శ్రవణము నూతన వస్త్రాలంకార ధారణ, రాజదర్శనములు విజయమహోత్సవము ప. 2-1

10 బ ౧ బుధ॥ అశ్విని వివాహము, సింహము రా. 3-56

13 బ ౩ శని॥ రోహిణి వివాహము సింహము రా. 3-52

19 బ ౧౦ శుక్ర॥ మఘ వివాహాదులు సింహము రా. 3-21

## కార్తీకమాసము

26 శు ౨ శుక్ర॥ అనూ వివాహ గర్భాధానాదులు కన్య రా. 4-25

28 శు ౪ ఆది॥ మూల వివాహాదులు సింహము రా. 2-37

31 శు ౭ బుధ॥ శ్రవ వివాహాదులు సింహము రా. 2-32

### నవంబరు నెల

1 శు ౮ గురు॥ వివాహ గర్భాధానములు కర్కాటకం రా. 11-21

5 శు ౧౨ సోమ॥ ఉ-భా. గర్భాధానము కర్కాటకం రా. 11-5

10 శు ౨ శని॥ రోహిణి వివాహ గృహారంభ ప్రవేశాదులు కన్య తె. 3-27.

11 శు ౩ ఆది॥ మృగ అన్నప్రాశన వివాహ గృహారంభ ప్రవేశాదులు ధనుస్సు ఉ. 10-18
వివాహం గర్భాధాన నవగృహ ప్రవేశాదులు మిథునం రా. 9-45

## మార్గశిరమాసః

### నవంబరు నెల

24 శు ౨ శని॥ మూల వివాహాదులు సింహము రా. 12-58

25 శు ౩ ఆది॥ మూల వివాహాదులు ధనుస్సు ఉ. 9-18

26 శు ౪ సోమ॥ ఉ-షా గర్భాధానము మిథునము రా. 8-46

29 శు ౭ గురు॥ ధని వివాహ గృహారంభాదులు ధనుస్సు ఉ. 9-7

0 శు ౮ శుక్ర॥ శత వివాహాదులు మిథునము రా. 8-31

### డిశంబరు నెల

1 శు ౯ శని॥ పూ-భా గర్భాధానము మిథునము రా. 8-26

2 శు ౧౦ ఆది॥ ఉ-భా వివాహ గృహప్రవేశాదులు కన్య రా. 2-1

7 శు ౧౪ శుక్ర॥ రోహి వివాహ గృహప్రవేశాదులు కన్య రా. 1-40

8 శు ౧౫ శని॥ వివాహ గృహప్రవేశాదులు మిథునం రా. 7-59

13 బ ౫ గురు॥ మఘా వివాహాదులు మిథునము రా. 7-39

14 బ ౬ శుక్ర॥ పూ-ఫ గర్భాధానము మిథునము రా. 7-35

15 బ ౭ శని॥ ఉ-ఫ. వివాహ గృహప్రవేశాదులు కన్య రా. 7-31

16 బ ౯ ఆది॥ ఉ-ఫ. వివాహ గృహారంభాదులు మకరము ఉ. 9–33

## పౌషమాసః

26 శు ౪ బుధ॥ ధని అన్నప్రాశనము మకరము ఉ. 8–54

29 శు ౭ శని॥ ఉ-భా. అన్నప్రాశనము మీనము ప. 11–47

## 1985 జనవరి నెల

7 శు ౧౫ సోమ॥ పున అన్నప్రాశనము మీనము ఉ. 11–12

## మాఘమాసః

23 శు ౨ బుధ॥ ధని అన్నప్రాశనాదులు మీనము ఉ. 10–9

31 శు ౧౦ గురు॥ రోహి అన్నప్రాశన, ఉపనయన వివాహ గృహారంభ ప్రవేశ వివాహాదులు కుంభము ఉ. 8–54

వివాహ గర్భాధానములు సిం. రా. 8–32

వివాహ గృహారంభ ప్రవేశాదులు ధనుస్సు తె. 5–0

## ఫిబ్రవరి నెల

1 శు ౧౧ శుక్ర॥ మృగ. వివాహ గృహప్రవేశాదులు సిం. రా. 8–29

3 శు ౧౩ ఆది॥ పున గృహారంభాదులు ధనుస్సు తె. 4–48

6 బ ౧ బు॥ మఘ. వివాహము ధనుస్సు తె. 4–35

7 బ ౨ గురు॥ పూ-ఫ. గృహారంభాదులు సింహము రా. 4–31

8 బ ౩ శుక్ర ఉ-ఫ. ఉపనయన వివాహ గృహారంభాదులు కుంభం ఉ. 8–21

9 బ ౪ శని॥ గర్భాధానము సింహం రా. 7–55

## ఫాల్గుణమాసము

21 శు ౨ గురు॥ ఉ-భా. వివాహాదులు మకరము తె. 4–58

23 శు ౪ శని. రేవతి వివాహ గృహారంభాదులు ధనుస్సు తె 5–8

వివాహ గృహారంభాదులు మకరము తె. 3–31

27 శు ౭ బుధ॥ రోహి వివాహ గృహారంభాదులు మకరము తె. 4–43

28 శు ౮ గురు॥ మృగ వివాహ గృహారంభాదులు మకరము తె. 4–39

## మార్చి నెల

7 శు ౧౫ గురు॥ ఉ-ఫ వివాహ గర్భాధానాదులు కన్య రా. 7–45

8 బ ౨ శుక్ర॥ ఉ-ఫ ఉపనయన వివాహ గృహారంభ ప్రవేశాదులు మీనము ఉ. 7–12

హస్త వివాహాదులు మకరము తె. 4–10

వివాహ గర్భాధానాదులు కన్య రా. 7–41

10 బ ౪ ఆది॥ వివాహ గర్భాధానాదులు కన్య. రా. 7–33

వివాహ గృహారంభాదులు మకరము తె. 3–59

15 బ ౯ శుక్ర॥ ఉ-షా వివాహ గృహారంభ ప్రవేశాదులు కుంభం. తె. 6–0

## 5. శుభముహూర్తములకు యోగ్యమగు తిథివార నక్షత్రలగ్నములను తెలుపు చక్రము

ఈ ముహూర్తములకు ఏకవింశతి మహాదోషములు లేక యుండవలెను
పాపగ్రహాక్రాన్త, వేధ, రాహిత్యముగూడా యుండవలెను.

| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| నిషేకము | 2-3-5<br>7-10 | సో-బు<br>గు-శు | అ-రో-ఉఫ-హా-స్వా-అనూ<br>ఉషా-శ్ర-శత-ఉభా | వృష-మిథు-కట<br>కన్య-తు-ధ-మీ | లగ్నశుద్ధి మాఘాది<br>పంచకము శుభము |
| గర్భాదానము | 2-3-5<br>7-10-13 | సో-బు<br>గు-శు | రో-మృ-పున-పుష్య-ఉఫ-హా<br>చి-స్వా-అనూ-ఉషా-శ్ర-ధ<br>శత-ఉభా | వృష-కట-కన్య-తు<br>ధను-మీనం | ౧-౭ శుద్ధి పంచపర్వ<br>ములు కూడవు |
| పుంసవనము<br>సీమంతము | 2-3-5-7<br>10-13 శు | సో-బు<br>గు-శు | అశ్వ-రో-మృ-పున-పుష్య<br>ఉఫ-హా-చి-స్వా-అనూ-మూ<br>ఉషా-శ్ర-ధ-శత-ఉభా-రే | మే-వృ-సిం<br>లగ్నములు కాక ఇతర<br>లగ్నములు శుభం | 4-8 మాసములు |
| జాతకర్మ<br>నామకరణం | 2-3-5-7<br>10-13 శు | సో-బు<br>గు-శు | అశ్వ-రో-పున-పు-ఉఫ-హా<br>స్వా-అనూ-ఉషా-శ్ర-ధ<br>శత-ఉభా | వృ-మి-కటక-కన్య<br>తుల-ధ-మీ | అష్టమశుద్ధి<br>నక్షచ్ఛిద్రములు<br>కూడదు |
| డోలా<br>రోహణం | 2-3-5-7<br>10-13 | సో-బు<br>గు-శు | అశ్వ-రో-మృ-పున-పు<br>ఉఫ-హస్త-చి-అనూ<br>ఉషా-ఉభా-రేవతి | వృ-మి-కట-కన్య-తు<br>ధను-మీనం | 1-3-5 మాసములు<br>అష్టమశుద్ధి |
| అన్నప్రాశనం | 2-3-5-7<br>10-13 | సో-బు<br>గు-శు | అశ్వ-రో-మృ-పున-పు-ఉఫ<br>హా-చి-స్వా-అనూ-ఉషా-శ్రవ<br>ధ-శత-ఉభా-రేవతి | వృ-మిధు-కన్య-కట<br>ధను-మీనం | 10 శుద్ధి<br>పురుషులకు సరిమాసం<br>స్త్రీలకు బేసిమాసం |
| కర్ణవేధ | 2-3-5-7<br>10-13 | సో-బు<br>గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-ఉఫ<br>హస్త-చి-అనూ-ఉషా-శ్రవ<br>ధని-ఉభా-రే | వృ-మి-కటక-కన్య<br>ధను-మీనం | అష్టమశుద్ధి 6-7-8<br>మాసములు |
| కేశఖండనము | 2-3-5-7<br>10-13 | సో-బు<br>గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-హా<br>చి-స్వా-శ్ర-ధ-శత-రే | వృ-మి-కటకం-కన్య<br>తుల-ధను-మీనం | ఉత్తరాయణం<br>పూర్వయామం |
| అక్షరా<br>భ్యాసము | 2-3-5<br>7-10 | సో-బు<br>గు-శు | అశ్వ-పున-పుష్య-హా-చి<br>స్వాతి-అనూ-శ్ర-రే | మే-కట-తు-మకర | అష్టమశుద్ధి ఉత్తరా<br>యణము ౫-వ సంవ<br>త్సరము |
| విద్యాభ్యాసము | 2-3-5<br>7-10 | ఆ-సో-బు<br>గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-ఆర్ద్ర<br>ఆశ్లే-హా-చి-స్వా-మూ-శ్ర | కట-తుల-మక<br>మీనం-మేషం | అష్టమశుద్ధి అనధ్యాయ<br>రహితం |

## శుభముహూర్తములకు యోగ్యమగు తిథివార నక్షత్రలగ్నములను తెలుపు చక్రము

ఈ ముహూర్తములకు ఏకవింశతి మహాదోషరాహిత్యము యుండవలెను.

పాపగ్రహాక్రాన్త, వేధ, రాహిత్యముగూడా యుండవలెను,

| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| ఉపనయనము | 2-3-5-7-10 కృ 2-3 | బు-గు-శు | అశ్వ-రో-మృ-పున-పుష్య ఉఫ-హ-చి-స్వా-అనూ-ఉషా శ్ర-ధ-శ-ఉభా-రే | వృష-మిథున-కటక కన్య-ధను-మీనం | రా శుద్ధి అనధ్యయన కూడదు కేంద్రమున పాపుండకూడదు |
| వివాహం | 2-3-5-7 10-13 | బు-గు-శు | రో-మృ-మఘ-ఉఫ-హ స్వా-అనూ-మూ-ఉషా ఉభా-రే | వృష-మిథు-కట-తుల కన్య-ధను-మీనం | సప్తమశుద్ధి మాఘాది పంచకం |
| నూతన వస్త్రధారణం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-రో.మృ-పున-ఉఫ-హ చి-స్వా-అనూ-మూ-ఉషా శ్ర-ధ-శత-ఉభా-రే | వృష-మిథు-కట కన్య-తుల-ధ-మీనం | తృతీయశుద్ధి |
| శంకుస్థాపనం | 2-3-5-7 10-13 | బు-గు-శు | అశ్వ-రో-మృ-పున-పు-ఉఫ హ-చి-స్వా-అనూ ఉషా-శ్ర-ధ-శత-ఉభా | వృష-మిథు-కన్య ధను-మీనం | చతుర్థశుద్ధి అష్టమశుద్ధి |
| గృహ ప్రవేశము | 2-3-5-7 10-13 | బు-గు-శు | రో-మృ-ఉఫ-చి-అనూ ఉషా-ధ-శత-ఉభా-రే | వృష-మిథు-కన్య ధను-మీనం | చతుర్థశుద్ధి అష్టమశుద్ధి వృషభకలశ చక్రశుద్ధి స్థిరలగ్నము |
| కూపారంభం | 2-3-5-7 10-13 | సో-గు-శు | రో-పుష్య-మృ-ఉఫ-హ అనూ-ఉషా-శ్ర-ఉభా | కట-మక-మీనం | లగ్నమున చంద్ర శుక్రలు ఉత్తరము తూర్పు ఈశాన్యం శుభం |
| ప్రయాణం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-మృ-పున-పుష్య-హ అనూ-శ్ర-ధ-రే-మూల | మేష-వృష-కట కన్య-తుల-ధను మీనం | వారశూలలు కూడదు |
| బీజావాపనం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-రో-మృ-పుష్య-ఉఫ హ-స్వా-అనూ-ఉషా-శ్ర-ధ ఉభా-రేవతి | వృష-మిథు-కటక కన్య-ధను-మీనం | విత్తనముల రంగు ననుసరించినవారములు మంచివి |
| క్షౌరం | 2-3-5-7 13 | సో-బు | అశ్వ-మృ-పున-పు-హ-చి స్వా-శ్ర-ధ-శత | వృష-మిథు-కట-తుల ధను-మీనం | భోజనాన స్తరం కూడదు భార్య 5 మాసములు గర్భవతిగ ఉండకూడదు |
| వాణిజ్యం | 2-3-5-7 10-13 | సో-బు గు-శు | అశ్వ-రో-మృ-పుష్య-హ చి-అనూ-రేవ-ఉత్త-ఉ-షా ఉ-భా | వృష-మిథు-కట కన్య-తు-ధ-మీనం | లాభ 11 స్థానమున శుభగ్రహముగాని దృష్టిగాని శుభము |

ఓమ్
శ్రీరస్తు నమః
శ్రీవేంకటేశాయనమః

# పంచాఙ్గ విషయ విజ్ఞానమార్గము

భారతదేశమున వేదాంగమగు జ్యోతిశ్శాస్త్రము ప్రతి మానవునకు అవసరమగు సాహాయ్యమును చేయుచున్నది. ఆ జ్యోతిశ్శాస్త్రము జాతకభాగము, ముహూర్తభాగము, సిద్ధాన్తభాగము అని మూడు విధములుగా ప్రచారములోనున్నది. ప్రతి మానవునకు 1 జాతకభాగము, భూతభవిష్యద్వర్తమాన రూపమగు త్రికాల విషయములను చెప్పుచూ జీవయాత్రకు తోడ్పడుచున్నది. 2 ముహూర్తభాగము, కార్యసిద్ధిని శుభఫలములను సమకూర్చుచు సాహాయ్య మాచరించుచున్నది. 3 సిద్ధాంతభాగము, పంచాంగరూపముగా నేర్పడి, దైనందినయాత్రలో సర్వవిధముల సాహాయ్య మాచరించుచున్నది.

ఈ భాగములన్నియు కాలమునకు సంబంధించి యున్నవిగా తెలియదగియున్నది:

సమయ వేత్తలు, ఆ కాలమును వత్సరము, అయనము, ఋతువు, మాసము, పక్షము, దినము అని ఆరువిధములుగా విభజించి ధర్మాచరణమునకు శ్రేయఃప్రాప్తికి మార్గమును చూపి యున్నారు.

1. వత్సరము — అయిదు విధములు :

చాంద్రవత్సరము, సౌరవత్సరము, సావనవత్సరము, నాక్షత్రవత్సరము, బార్హస్పత్య వత్సరము.

1 చాంద్రవత్సరము : అనగా శుక్లప్రతిపత్ మొదలు దర్శాన్తములగు చైత్రాదిమాసములు 12 కలదై 354 దినములు కలిగియుండును. ఈ చాంద్రవత్సరము ప్రభవాది అరువది నామములు కలదైయున్నది.

2 సౌరవత్సరము : అనగా మేషాది ద్వాదశరాశులయందు రవిసంక్రమణముచే ఏర్పడి 365 దినములు కలిగియుండును.

3 సావనసంవత్సరము : అనగా మాసమునకు ముప్పది దినముల చొప్పున 360 దినములు కలదైయుండును. ఇది యుగమన్వంతాది విభాగక్రమమును తెలియచేయును.

4 నాక్షత్రవత్సరము : అనగా అశ్విని మొదలుగు 27 నక్షత్రములయందు చంద్ర సంచారముచేత యేర్పడిన 12 మాసములుకలదై 324 దినములు కలిగియుండును.

5 బార్హస్పత్యసంవత్సరము : అనగా మేషాది రాశులయందు బృహస్పతిసంచారముచేత యేర్పడి 361 దినములు కలిగియుండును.

2. అయనము — రెండు విధములు : దక్షిణాయణము — ఉత్తరాయణము

1 దక్షిణాయనము — అనగా సూర్యునియొక్క కటక సంక్రమణము మొదలు ఆరు రాశులయందు సంచారముచేత యేర్పడునది. అప్పుడు భూమధ్యరేఖకు దక్షిణముగా సంచరించును.

2 ఉత్తరాయణము — అనగా సూర్యునియొక్క మకర సంక్రమణము మొదలు ఆరురాశులయందు సంచారముచేత యేర్పడునది. అప్పుడు భూమధ్యరేఖకుఉత్తరముగా సంచరించును.

3. ఋతువు — రెండు విధములు : సౌరము — చాంద్రములని

1 సౌరము — అనగా సూర్యునియొక్క రాశి ద్వయ సంచారముచే యేర్పడి వసంతాది ఆరునామములు కలిగియున్నది.

2 చాంద్రము — అనగా చైత్రాదిమాస ద్వయ రూపమై వసంతాది ఆరు నామములు కలిగియున్నది.

4. మాసము — నాలుగు విధములు : చాంద్రము — సౌరము — సావనము — నాక్షత్రము.

1 చాంద్రమానము — అనగా శుక్ల ప్రతిపత్ మొదలు దర్శాన్తముగాని కృష్ణప్రతిపత్ మొదలు పూర్ణిమాన్తముగాని చాంద్రమానము అని రెండు విధములుగా నున్నవి. అది చైత్రాదినామములు కలిగియున్నది.

దర్శాన్తమాసము — ముఖ్యపక్షము : పూర్ణిమాన్తమాసము — వింధ్యకు ఉత్తరదేశమునందు గ్రహింపబడియున్నది.

2 సౌరమానము — అనగా కొందరు సూర్యుని మీనరాశి సంక్రమణము ప్రారంభించియు, కొందరు మేషరాశి సంక్రమణము ప్రారంభించియు, చైత్రాదిమాసములను చెప్పుచున్నారు.

3 సావనమానము — అనగా ముప్పది దినములుగలదై యుండును.

4 నాక్షత్రమానము — అనగా చంద్రుడు అశ్వని మొదలు 27 నక్షత్రములయందు సంచరించు కాలము.

5. పక్షము — రెండు విధములు: శుక్లపక్షము — కృష్ణ పక్షము

1 శుక్లపక్షము — అనగా శుక్ల ప్రతిపత్ మొదలు పూర్ణిమాన్త పక్షము.

2 కృష్ణపక్షము — అనగా బహుళ ప్రతిపత్ మొదలు దర్శాన్తపక్షము.

6. దినము — అనగా :

ఆరువది ఘడియల కాలము. అది సూర్యోదయము మొదలు తిరిగి సూర్యోదయమువరకు గల కాలము. ఇటుల ఆరు విధములగు కాలమును తెలియజేయుటకు ప్రవర్తించునది పంచాంగము. ఇది మానవులకు కల్పవృక్షమువంటిది. అట్టి పంచాంగమును వివరణములతోను, విశేషములతోను తెలియుటకు మార్గమును చూడుము.

(1) పంచాఙ్గము : అనగా అయిదు అంగములు కలది. 1 తిథి, 2 వారము, 3 నక్షత్రము, 4 యోగము, 5. కరణము.

తిథులు 15 : 1 పాడ్యమి, 2 విదియ, 3 తదియ, 4 చవితి, 5 పంచమి, 6 షష్ఠి, 7 సప్తమి, 8 అష్టమి, 9 నవమి, 10 దశమి, 11 ఏకాదశి, 12 ద్వాదశి, 13 త్రయోదశి, 14 చతుర్దశి 15 ○ పూర్ణిమ, ● అమావాస్య.

వారములు 7 : 1 ఆదివారము, 2 సోమవారము, 3 మంగళవారము, 4 బుధవారము, 5 గురువారము, 6 శుక్రవారము, 7 శనివారము,

నక్షత్రములు 27 : 1 అశ్వని, 2 భరణి, 3 కృత్తిక, 4 రోహిణి, 5 మృగశిర, 6 ఆర్ద్ర, 7 పునర్వసు, 8 పుష్యమి, 9 ఆశ్లేష, 10 మఖ, 11 పుబ్బ, (పూర్వఫల్గుని) 12 ఉత్తర, (ఉత్తరఫల్గుని) 13 హస్త, 14 చిత్ర, 15 స్వాతి, 16 విశాఖ, 17 అనూరాధా, 18 జ్యేష్ఠ, 19 మూల, 20 పూర్వాషాఢ, 21 ఉత్తరాషాఢ, (అభిజిత్) 22 శ్రవణం, 23 ధనిష్ఠ, 24 శతభిషం, 25 పూర్వాభాద్రా, 26 ఉత్తరాభాద్రా, 27 రేవతి.

యోగములు 27 : 1 విష్కంభం, 2 ప్రీతి, 3 ఆయుష్మాన్, 4 సౌభాగ్యం, 5 శోభనం, 6 అతిగండం, 7 సుకర్మ, 8 ధృతి, 9 శూలం, 10 గండం, 11 వృద్ధి, 12 ధ్రువము, 13 వ్యాఘాతము, 14 హర్షణము, 15 వజ్రము, 16 సిద్ధి, 17 వ్యతీపాత్, 18 వరియాన్, 19 పరిఘా, 20 శివం, 21 సిద్ధం, 22 సాధ్యం, 23 శుభం, 24 శుక్రం, 25 బ్రాహ్మం, 26 ఐంద్రం, 27 వైధృతి.

కరణములు 11 : 1 బవ, 2 బాలవ, 3 కౌలవ, 4 తైతుల, 5 గరజి, 6 వణజి, 7 భద్ర, 8 శకుని, 9 చతుష్పాత్, 10 నాగవం, 11 కింస్తుఘ్నం.

పక్షములు 2 : 1 శుక్లపక్షము. (చంద్రునకు కళలు వృద్ధియగు దినములు).
2 కృష్ణపక్షము. (చంద్రునకు కళలు తగ్గిపోవు దినములు).

సూచన : పంచాంగములో ఈ తిథి, వార, నక్షత్ర యోగ కరణములయొక్క ప్రథమాక్షరములను చూచి తిథి, వార, నక్షత్ర యోగ కరణములుగా చదువుకొన వలయును.

(2) మాసముల వివరణము :

| చాంద్ర | సౌర | ద్రావిడ | శాలి | ఇంగ్లీషు |
|---|---|---|---|---|
| చైత్రము | మేషం | చిత్రి | చైత్ర 30 | జనవరి 31 |
| వైశాఖము | వృషభం | వైయ్యాశి | వైశాఖ 31 | ఫిబ్రవరి 28 |
| జ్యేష్ఠము | మిథునం | అని | జ్యేష్ఠ 31 | మార్చి 31 |
| ఆషాఢము | కర్కాటకం | ఆడి | ఆషాఢ 31 | ఏప్రియల్ 30 |
| శ్రావణము | సింహం | అవణి | శ్రావణ 31 | మే 31 |
| భాద్రపదము | కన్య | పెరటాసి | భాద్రపద 31 | జూన్ 30 |
| ఆశ్వయుజము | తుల | అర్పిసి | ఆశ్వన 30 | జూలై 31 |
| కార్తీకము | వృశ్చికం | కార్తికి | కార్తికి 30 | ఆగస్టు 31 |
| మార్గశిరము | ధనుస్సు | మార్గళి | మార్గశీర్ష 30 | సెప్టెంబరు 30 |
| పుష్యము | మకరం | తై | పౌష 30 | అక్టోబరు 31 |
| మాఘము | కుంభం | మాసి | మాఘ 30 | నవంబరు 30 |
| ఫాల్గుణము | మీనం | పంగుని | ఫాల్గుణ 30 | డిశంబరు 31 |

సూచన : శాలి, ఇంగ్లీషు, నెలలలో ప్రక్కనగల సంఖ్యలు ఆ నెలలకు గల రోజులుగా తెలియవలెను.

(3) చాంద్రమానమున మాసనామనిర్ణయము ఇట్లు యేర్పడెను.

| | | | | |
|---|---|---|---|---|
| పూర్ణిమయందు | చిత్రా | నక్షత్రముకల | మాసము | చైత్రమాసము |
| ,, | విశాఖా | ,, | ,, | వైశాఖమాసము |
| ,, | జ్యేష్ఠ | ,, | ,, | జ్యేష్ఠమాసము |
| ,, | పూర్వాషాఢ, ఉత్తరాషాఢ | | | ఆషాఢమాసము |
| ,, | శ్రవణ | ,, | ,, | శ్రావణమాసము |
| ,, | పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర | | | భాద్రపదమాసము |
| ,, | అశ్విని | ,, | ,, | ఆశ్వీయుజమాసము |
| ,, | కృత్తిక | ,, | ,, | కార్తీకమాసము |
| ,, | మృగశిర | ,, | ,, | మార్గశిరమాసము |
| ,, | పుష్యమి | ,, | ,, | పుష్యమాసము |
| ,, | మఖ | ,, | ,, | మాఘమాసము |
| ,, | పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని | | | ఫాల్గుణమాసము |

(4) సౌరమానమున మాసనామనిర్ణయము ఇట్లు యేర్పడెను.

| | | | | |
|---|---|---|---|---|
| సూర్యుడు | మేష లగ్నమున | ప్రవేశించినది | మొదలు | మేషమాసము |
| ,, | వృషభ | ,, | ,, | వృషభమాసము |
| ,, | మిథున | ,, | ,, | మిథునమాసము |
| ,, | కర్కాటక | ,, | ,, | కర్కాటకమాసము |
| ,, | సింహ | ,, | ,, | సింహమాసము |
| ,, | కన్య | ,, | ,, | కన్యామాసము |
| ,, | తులా | ,, | ,, | తులామాసము |
| ,, | వృశ్చిక | ,, | ,, | వృశ్చికమాసము |
| ,, | ధనుస్సు | ,, | ,, | ధనుర్మాసము |
| ,, | మకర | ,, | ,, | మకరమాసము |
| ,, | కుంభ | ,, | ,, | కుంభమాసము |
| ,, | మీన | ,, | ,, | మీనమాసము |

(5) ద్రావిడమానములు, సౌరమానమునను సరించి సూర్యుడు మేషము, వృషభము మొదలగు లగ్నములయందు ప్రవేశించిన దినములయందే చిత్రి, వైయ్యాశి మొదలగు మాసములు ప్రారంభమగు చున్నవి. చాంద్రమానచ్ఛాయ ననుసరించి సామాన్యముగా ఆ మాసముల నామములు యేర్పడుచున్నవిగా భావించవలెను.

(6) శాలిశకమానములు, సౌరమానము ననుసరించి సూర్యునియొక్క మేషసంక్రమణమునకు ముందుగా మేషాయనము ప్రారంభమగుచున్నది. ఆ మేషాయన ప్రారంభదినమే శాలిశక చైత్రమాస ప్రారంభదినము. ఇటులనే సూర్యునియొక్క వృషభాది సంక్రమణములకు ముందుగా వృషభాద్యయన ములు ప్రారంభమగుచున్నవి. ఆ వృషభాద్యయన ప్రారంభదినములే శాలిశక వైశాఖాదిమాస ప్రారంభ దినములగుచున్నవి. ఇటుల శాలిశకమాసములు సౌరమానమునను సరించి ప్రారంభమగుట, చాంద్ర మానము ననుసరించి చైత్ర వైశాఖాది నామములు యేర్పడుట అని తెలియుదగియున్నది. ముఖ్యాంశమేమన సూర్యునియొక్క మేషాదిలగ్న సంక్రమణముల ననుసరించి ద్రావిడమానములు చిత్రి, వైయ్యాశి అను మొదలగు మాసనామములు ప్రారంభమగుచున్నవి. సూర్యునియొక్క మేషాద్యయనముల ననుసరించి శాలిశకమానములు చైత్ర, వైశాఖ మొదలగు మాసములు ప్రారంభమగుచున్నవిగా తెలియదగియున్నది రెంటికి మాసముల నామములు చాంద్రమానచ్ఛాయలోనే యేర్పడుచున్నవి గాని వేరుగాదు అని తెలియదగి యున్నది.

(7) 1. చైత్రశుద్ధపాడ్యమి - చాంద్రమాన సంవత్సర ప్రారంభమగును. 2. మేషమాసము 1 వ తేదీ సూర్యుని మేషసంక్రమణ ప్రారంభమే సౌరమాన సంవత్సర ప్రారంభమగును. 3. చిత్రినెల 1 వ తేదీ ద్రావిడ సంవత్సర ప్రారంభమగును. 4. సూర్యుని మేషాయన ప్రారంభమే చైత్ర 1 వ తేది శాలివాహనశక వత్సరారంభమగును. 5. జనవరి 1 వ తేది హూణశకవత్సర ప్రారంభమగును. ఇటులనే భారతదేశమున పలువిధములగు సంవత్సరములు, తత్ప్రారంభములున్నూ కలిగియున్నవి.

(8) విశేషములు — హూణశక సంవత్సరములను నాలుగుచే భాగించిన శేషము సున్న వచ్చిన యెడల ఆ సంవత్సరమునకు లీప్ సంవత్సరమని పేరు. అట్లు లీప్ సంవత్సరములో ఫిబ్రవరినెలకు 29 దినములు వచ్చును. శాలివాహనశక వత్సరములను నాలుగుచే భాగించిన శేషము రెండువచ్చిన లీప్ సంవత్సరమన బడును. అట్లు లీప్ సంవత్సరములో చైత్ర 31 రోజులు - మామూలు సంవత్సరములో ఆ చైత్ర 30

రోజులుకలదై యుండును. వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ, భాద్రపద ఈ ఐదు నెలలలో ఎల్లప్పుడు ప్రతినెలకు 31 రోజులు ఉండును. మిగతా ఆశ్వయ, కార్తీక, మార్గశీర్ష, పౌష, మాఘ, ఫాల్గుణ, ఈ ఆరునెలలలో ఎల్లప్పుడు ప్రతినెలకు 30 రోజులుండును.

(9) ఋతువులు 6 : 1 వసంతఋతువు, 2 గ్రీష్మఋతువు, 3 వర్షఋతువు, 4 శరదృతువు 5 హేమంతఋతువు, 6 శిశిరఋతువు.

(10) అయనములు 2 : 1 ఉత్తరాయణము అనగా భూమధ్యరేఖకు ఉత్తరమున సూర్యుడు సంచరించుకాలము (మాఘమాసము మొదలు ఆషాఢమాసము వరకు). 2 దక్షిణాయనము అనగా భూమధ్య రేఖకు దక్షిణమున సూర్యుడు సంచరించుకాలము (శ్రావణమాసము మొదలు పుష్యమాసము వరకు) అని తెలియదగియున్నది.

(11) సంవత్సరములు 60 :

| | | | |
|---|---|---|---|
| 1 ప్రభవ | 16 చిత్రభాను | 31 హేమలంబ | 46 పరిధావి |
| 2 విభవ | 17 సుభాను | 32 విళంబ | 47 ప్రమాదీ |
| 3 శుక్ల | 18 తారణ | 33 వికారి | 48 ఆనంద |
| 4 ప్రమోద | 19 పార్థివ | 34 శార్వరి | 49 రాక్షస |
| 5 ప్రజాపతి | 20 వ్యయ | 35 ప్లవ | 50 నల |
| 6 అంగీరస | 21 సర్వజిత్ | 36 శుభకృత్ | 51 పింగళ |
| 7 శ్రీముఖ | 22 సర్వధారి | 37 శోభకృత్ | 52 కాళయుక్త |
| 8 భావ | 23 విరోధి | 38 క్రోధీ | 53 సిద్ధార్థి |
| 9 యువ | 24 వికృతి | 39 విశ్వావసు | 54 రౌద్రి |
| 10 ధాత | 25 ఖర | 40 పరాభవ | 55 దుర్మతి |
| 11 ఈశ్వర | 26 నందన | 41 ప్లవంగ | 56 దుందుభి |
| 12 బహుధాన్య | 27 విజయ | 42 కీలక | 57 రుధిరోద్గారి |
| 13 ప్రమాధి | 28 జయ | 43 సౌమ్య | 58 రక్తాక్షి |
| 14 విక్రమ | 29 మన్మథ | 44 సాధారణ | 59 క్రోధన |
| 15 వృష | 30 దుర్ముఖ | 45 విరోధకృత్ | 60 క్షయ |

ఇవి పురాణప్రసిద్ధములగు సంవత్సరములుగా తెలియవలయును. ఇంగ్లీషు సంవత్సరములలో మార్చి, ఏప్రియల్ నెలలలో ఈ సంవత్సరములు ప్రారంభమగును. ఇంగ్లీషు సంవత్సరములలో మార్చి 21, 22 తేదీలలో శాలివాహనశక వత్సరము ప్రారంభమగును.

(12) నవగ్రహములు 9 : 1 సూర్యుడు, 2 చంద్రుడు, 3 కుజుడు, 4 బుధుడు, 5 గురువు, 6 శుక్రుడు, 7 శని, 8 రాహువు, 9 కేతువు.

(13) ద్వాదశరాశులు 12 :— 1 మేషము, 2 వృషభము, 3 మిథునము, 4 కర్కాటకము, 5 సింహము, 6 కన్య, 7 తుల, 8 వృశ్చికము, 9 ధనుస్సు, 10 మకరము, 11 కుంభము, 12 మీనము ఈ రాశులను లగ్నములు అనియు, హోరలనియు వ్యవహరించుచున్నారు. ఈద్వాదశ రాశులలో 1,4,7,10, చరరాసులు 2,5,8,11, స్థిరరాశులు 3,6,9,12, ద్విస్వభావ రాశులుగా తెలియవలెను.

(14) ఈ ద్వాదశరాశులకధిపతులు :

1 మేషమునకు 8 వృశ్చికమునకు = కుజుడు.

2 వృషభమునకు 7 తులకు = శుక్రుడు.

3 మిథునమునకు 6 కన్యకు = బుధుడు.

4 కర్కాటమునకు = చంద్రుడు.

5 సింహమునకు = సూర్యుడు,

9 ధనుస్సుకు 12 మీనమునకు = గురువు

10 మకరమునకు 11 కుంభమునకు = శని

(15) ఈ రాశులు నక్షత్రములవలన యేర్పడుచున్నవి. ఎట్లు అనగా ఒక్కొక్క నక్షత్రమునకు నాలుగు పాదములు. అందుచే 27 $\times$ 4=108 పాదములు. ఈ పండ్రెండు రాశులకు 108 పాదములు చేర్చవలెను. 12 $\times$ 9=108 పాదములు గాన ఒక్కొక్కరాశికి 9 పాదములు చేరుచున్నవి. అనగా వివరణ మిట్లు:

| | | |
|---|---|---|
| 1. అశ్విని 4, భరణి 4, కృత్తిక 1 | = 9 పాదములు | మేషము |
| 2. కృత్తిక 3, రోహిణి 4, మృగశిర 2 | = 9 పాదములు | వృషభము |
| 3. మృగశిర 2, ఆర్ద్ర 4, పునర్వసు 3 | = 9 పాదములు | మిథునము |
| 4. పునర్వసు 1, పుష్యమి 4, ఆశ్రేష 4 | = 9 పాదములు | కర్కాటకము |
| 5. మఖ 4, పుబ్బ 4, ఉత్తర 1 | = 9 పాదములు | సింహము |
| 6. ఉత్తర 3, హస్త 4, చిత్ర 2 | = 9 పాదములు | కన్య |
| 7. చిత్ర 2, స్వాతి 4, విశాఖ 3 | = 9 పాదములు | తుల |
| 8. విశాఖ 1, అనూరాధా 4, జ్యేష్ఠ 4 | = 9 పాదములు | వృశ్చికము |
| 9. మూల 4, పూర్వాషాఢ 4, ఉత్తరాషాఢ 1 | = 9 పాదములు | ధనుస్సు |
| 10. ఉత్తరాషాఢ 3, శ్రవణం 4, ధనిష్ఠ 2 | = 9 పాదములు | మకరం |
| 11. ధనిష్ఠ 2, శతభిషం 4, పూర్వాభాద్రా 3 | = 9 పాదములు | కుంభము |
| 12. పూర్వాభాద్రా 1, ఉ-భాద్రా 4, రేవతి 4 | = 9 పాదములు | మీనము |

(16) ఈ నక్షత్రముల వలన యేర్పడు మహాదశలు వివరము.

| | | | |
|---|---|---|---|
| కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢా | = ఈ 3 నక్షత్రములకు | రవి మహాదశా | ఆరు సంవత్సరములకాలము |
| రోహిణి, హస్త, శ్రవణము | = ఈ 3 నక్షత్రములకు | చంద్రమహాదశా | పది సంవత్సరములకాలము |
| మృగశిర, చిత్ర, ధనిష్ఠ | = ఈ 3 నక్షత్రములకు | కుజమహాదశా | ఏడు సంవత్సరములకాలము |
| ఆర్ద్ర, స్వాతీ, శతభిషం | = ఈ 3 నక్షత్రములకు | రాహుమహాదశా | పదునెనిమిది సంవత్సరములు |
| పునర్వసు, విశాఖ, పూర్వాభాద్రా | = ఈ 3 నక్షత్రములకు | గురుమహాదశా | పదహారు సంవత్సరములు |
| పుష్యమి, అనూరాధా, ఉ-భాద్రా | = ఈ 3 నక్షత్రములకు | శనిమహాదశా | పందొమ్మిది సంవత్సరములు |
| ఆశ్రేష, జ్యేష్ఠ, రేవతి | = ఈ 3 నక్షత్రములకు | బుధమహాదశా | పదిహేడు సంవత్సరములు |
| మఖ, మూలా, అశ్వని | = ఈ 3 నక్షత్రములకు | కేతుమహాదశా | యేడు సంవత్సరములు |
| -పుబ్బ, పూర్వాషాఢా, భరణి | = ఈ 3 నక్షత్రములకు | శుక్రమహాదశా | ఇరువది సంవత్సరములు |

మహాదశలు మొత్తము 120 సంవత్సరములుగా తెలియవలసియున్నది. ఈ పైై తెలిపిన నక్షత్రములలో జాతకుడు ఏనక్షత్రములో జన్మించెనో ఆ నక్షత్రము జన్మనక్షత్రము, ఆ నక్షత్రమునకు చెప్పిన దశ జననకాల మహాదశగా తెలియవలయును.

(17) భగణము = ద్వాదశరాశ్యాత్మక కాలచక్రము. ఇది రాశి భాగ లిప్త విలిప్త రూపములుగా గుణింపబడుచున్నది. అందు 60 విలిప్తలు 1 లిప్త, 60 లిప్తలు 1 భాగ. 30 భాగలు 1 రాశి, 12 రాశులు 1 భగణము ఈ భగణము-సప్తవింశతి నక్షత్రాత్మకముమ అగుచున్నది. చూడుము భగణము= 12 రాశులు మరియు 27 నక్షతములు నక్షత్రమునకు 4 పాదముల చొప్పున 108 పాదములు కలది అగుచున్నది.

## దివాహోరాచక్రము

(ప్రతిహోరయు సూర్యోదయము మొదలు ఒక్కొక్క గంటకాలము చొప్పున తిరిగి సూర్యోదయము వరకు జరుగుచుండును)

| వారం | 6మొ 7వ | 7-8 | 8-9 | 9-10 | 10-11 | 11-12 | 12-1 | 1-2 | 2-3 | 3-4 | 4-5 | 5-6. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| సోమ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| మంగళ | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| బుధ | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| గురు | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| శుక్ర | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| శని | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |

## రాత్రిహోరాచక్రము

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| సోమ | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| మంగళ | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| బుధ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| గురు | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| శుక్ర | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| శని | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

షరా: చంద్ర శుక్ర హోరలుశుభఫలమును, బుధ కుజ హోరలు మధ్యమఫలమును, సూర్య శని హోరలు అధమ ఫలమును ఇచ్చును. చంద్ర గురు శుక్ర, హోరలయందు రాహుకాలముగాయుండినను కార్యామకూలంగాయుండును. క్షీణ చంద్రుడు, పాపసహిత బుధుడు వీరుపాపులు. అని తెలియవలసియున్నది.

ఇటులనే తిథి, నక్షత్ర, యోగ, కరణములు కూడా సూర్య చంద్ర గమన, స్థితి, వైషమ్యముల చేతను, చంద్రస్థితి, గమనాదుల చేతను, సూర్యచంద్రగతి స్థిత్యాదులచేతను, సూర్యచంద్రుల స్ఫుటరీతి చేతను యేర్పడుచున్నవి. ఇటుల పంచాంగము యేర్పడియున్నది.

విశేషము: సూర్యుడు ద్వాదశరాశ్యాత్మక భచక్రమును పూర్ణముగా చుట్టివచ్చుటచేత 360 దినములు 12 మాసములుగల ఒక సంవత్సరము యేర్పడుచున్నది. ఇట్టి సంవత్సరములు 432000 సంవత్సరముల పరిమితిగల కాలము కలియుగము, 864000 సంవత్సరముల పరిమితిగల కాలము ద్వాపరయుగము, 1296000 సంవత్సరముల పరిమితకాలము త్రేతాయుగము, 1728000 సంవత్సరముల పరిమిత కాలము కృతయుగము, ఈ నాలుగుయుగముల పరిమాణకాలము మొత్తము 4320000 సంవత్సరములు. ఇట్టి పరిమాణముగల కాలమును మహాయుగము అని చెప్పుచున్నారు.

ఇట్టి మహాయుగములు 71 అయిన కాలమును ఒక మనువు పరిపాలించుచున్నాడు. దానిని మన్వన్తరము అనుచున్నారు. ఇట్టివి 14 మన్వంతరముల కాలము సృష్టికర్తయగు బ్రహ్మదేవునకు ఒక పగలు అగుచున్నది. ఇటుల బ్రహ్మయొక్క పగటికాలము వెయ్యి మహాయుగములు (అనగా 4320000000 సంవత్సరములు) ఇది ఉదయకల్పము. అనియు ఇంత పరిమాణముగల రాత్రి కాలమును క్షయకల్పమనియు వ్యవహరించుచున్నారు.

1. ఉదయకల్పము అనగా ప్రపంచ రచనాకాలము (పగటికాలము), 2. క్షయకల్పము అనగా బ్రహ్మ నిద్రించుకాలము (రాత్రికాలము). ఈ రెండు కల్పములయొక్క పరిమితికాలము 8640000000 సంవత్సరములు. ఇట్లు ఉదయ క్షయకల్పములు రెండును సృష్టికర్తయగు బ్రహ్మకు అహోరాత్రమగు చున్నది. అనగా బ్రహ్మకు ఒకదినము. ఇట్టి 360 దినములు బ్రహ్మకు ఒక సంవత్సరమగుచున్నది.

ఇట్టి సంవత్సరములు నూరు (శతసంవత్సరములు) బ్రహ్మకు ఆయుర్భాగ్యము కలిగియున్నది. అనాదియగుకాలమునందు ఒక సంకేతము ననుసరించి ఈ చతుర్ముఖబ్రహ్మను 7-వ బ్రహ్మనుగా చెప్పుచున్నారు. శ్రీభారతమున శాన్తిపర్వమున వేదవ్యాసులవారు వివరించినట్లు అఖిల హేయ ప్రత్యనీక కల్యాణగుణాకరుండును, అఖిలవేద వేదాన్తవేద్యుండును, అఖిల చరాచర సృష్టి స్థితి లయ కర్తయునగు శ్రీమన్నారాయణుని సంకల్పము వలన 1 మానసజన్మ, 2 చాక్షుషజన్మ, 3 వాచికజన్మ, 4 శ్రావణజన్మ, 5 నాసికజన్మ, 6 అండజన్మ గల ఆరుగురు సృష్టికర్తలు బ్రహ్మలు అనాదికాలంలో ఒక సంకేతకాలం నుంచి ఇప్పటికి గతించినారు.

ఇప్పుడు సప్తమ జన్మయగు (పద్మభూః) నాభికమలమున జన్మించిన చతుర్ముఖుడు సృష్టికర్తృత్వమును స్వీకరించియున్నాడు. ఈ బ్రహ్మకు ఆయుర్భాగ్యమగు నూరుసంవత్సరములలో యేబది సంవత్సరములు గడచినవి. (దీనిని పూర్వపరార్థము అనుచున్నారు). ఇప్పుడు ద్వితీయ పరార్థము ప్రారంభమైనది. అనగా 51-వ సంవత్సరము ప్రారంభమైనది. ఆ ప్రథమ సంవత్సరములో ప్రథమమాసము, ప్రథమపక్షము, ప్రథమదినము జరుగుచున్నది. ఆ ప్రథమదినములో పగటికాలములో (ద్వితీయయామమున తృతీయముహూర్తము నందు) 13 ఘడియల 42 విఘడియల కాలము గతించినది.

ఈ సమయము లోపల 1 స్వాయంభువ, 2 స్వారోచిష, 3 ఉత్తమ, 4 తామస, 5 రైవత, 6 చాక్షుష అను నామధేయములుగల 6-గురు మనువులు ఒక్కొక్కరు 71 మహాయుగముల కాలమును పరిపాలించి గతించినారు. ఇప్పుడు 7-వ మనువు అగు వైవస్వతమనువు పరిపాలించుచున్నాడు. ఈ వైవస్వతమనువునకు ఆయుర్భాగ్యముగా నేర్పడియున్న 71 మహాయుగముల కాలములో 28-వ మహాయుగములో కలియుగము నడచుచున్నది. 432000 సంవత్సరముల పరిమాణముగల ఆ కలియుగములో ఈ రుధిరోద్గారి సంవత్సరము 5084 వ సంవత్సరముగా ప్రారంభమగుచున్నది — అని కాలవిజ్ఞాన సంపన్నులగు మహాశయులు శాస్త్రీకదృక్కులై తెలుసుకొని యున్నారు. ప్రాచీనులగు మనపూర్వులు అంతర్ముఖులై నియమ నిష్ఠాగరిష్ఠులై పరమేశ్వరోపాసన మొనరించి సర్వజ్ఞు లగుటయేకాక వారి విజ్ఞానమును శాస్త్రములయందు నిక్షేపించి అర్వాచీనులగు మన పూర్వుల ద్వారా మనకందజేయుటచే నీ విజ్ఞానమును బడయగలుగుచున్నామని మనము సంతసించవలసియున్నది.

విశేషములు: సూర్యునియొక్క స్థిరరాశులయందలి సంక్రమణమును "విష్ణుపదం" అనియును ద్విస్వభావ రాశులయందలి సంక్రమణమును "షడశీతి" అనియును.

చరరాశులై సమసప్తకములగు తులామేషరాశులయందలి సంక్రమణమును "విషువం" అనియును చరరాశులై సమసప్తకములగు కటకమకరరాశులయందలి సంక్రమణమును "అయనం" అనియును శాస్త్రములు చెప్పుచున్నవి.

## అధికమాసాది విజ్ఞానము

చాంద్రమానమునందు యే మాసములు సూర్యుని సంక్రమణము లేకయున్నవో అనగా సౌరమాసము ప్రారంభము కావేరదో, మాసముయొక్క శుక్లపాడ్యమి మొదలు అమావాస్య వరకు సూర్యుడున్న రాశికి చలనములేదో ఆ మాసము అధిక మాసముగా తెలియవలెను.

